# 1

కాస్ట్రో వీధిలో ఉన్న ఆ ఇంట్లో నివసించడం నాకు బాగా జ్ఞాపకం ఉంది. తెలిసిన మొహాలతో ఇల్లు కళకళలాడుతూ ఉండేది. అమ్మ, నాన్న, ఒక్కగాని ఒక్క అన్న నెల్స్. [illegible]తో పాటు చెల్లెలు క్రిస్టినీ కూడా అదే ఇంట్లో ఉండేది. ఆమె, నేను, వయస్సులో కొంచెం దగ్గరగా ఉండేవాళ్ళం. అయినప్పటికీ ఆమె తనలో తనే జీవిస్తూ, దూరంగా ఉన్నట్టు, అవుపడేది. నా ఆఖరి చెల్లెలు దాగ్‌మర్ కూడా మాతోటే ఉండేది.

అమ్మ అక్కచెల్లెళ్ళు నలుగురూ ఆ ఇంటికి తరుచు వస్తూ ఉండేవారు. నలుగురిలోనూ జెన్నీ పిన్ని బాగా ముసలిది. అధికార ధోరణిలో మాట్లాడుతూ ఉండేది. సిగ్రెడ్, మార్తా, పెళ్ళి కాని త్రైనా—ఈ పిన్ని అందరూ నాకు బాగా జ్ఞాపకం.

అమ్మ మేనమామ క్రిస్ కూడా అప్పుడప్పుడు వస్తూ ఉండేవాడు. హడావిడిగా ఇంట్లోకి జొరబడే అతన్ని చూస్తూంటే, మాకు చాలా విచిత్రంగా ఉండేది.

మామూలుగా సాగిపోయే మా జీవితాల్లోకి అతను ఒక విధమయిన చైతన్యాన్ని ప్రసరించేవాడు.

ఎంతమంది ఆ ఇంటికి వచ్చినా నాకు బాగా జ్ఞాపకం ఉన్నది మా అమ్మే! అమ్మను గురించి ఆలోచిస్తుంటే, అనేక దృశ్యాలు నా మనస్సులో తిరుగుతూంటాయి. ప్రతి శని వారం వంటింట్లో బల్ల ముందు కూర్చొని, కనురెప్పలను చిట్లిస్తూ, నాన్న పట్టుకొచ్చిన డబ్బును అమ్మ జాగ్రత్తగా లెక్క పెట్టు కొనేది. ఆ డబ్బుని ఎంత, ఎవరికి ఇయ్యా వలసినదీ ఉజ్జాయింపుగా నిర్ణయించుకునేది.

'ఇది ఇంటి అద్దెకి,' అంటూ అమ్మ కొంత డబ్బును వేరే పెట్టేది.

'ఇది కిరాణా షాపువాడికి.'

'ఇది క్రిస్టిన్ జోళ్ళను బాగు చేయించ డానికి ఉపయోగించాలి.'

ఈ విధంగా అమ్మ తనలో తనే అను కొంటూ, నాన్న తెచ్చిన డబ్బును విభజిస్తూ ఉండేది.

"మాస్టారు ఈ వారంలో ఒక కొత్త నోటు పుస్తకం కొనుక్కోమన్నారు." అమ్మ వైపు ఆప్యాయంగా చూస్తూ క్రిస్టీనీ, నెల్స్,

నేనూ – మాలో ఎవరో ఒకరు పై విధంగా అనే వాళ్ళం. మా అవసరాన్ని గుర్తించి, అమ్మ వెంటనే కొంత చిల్లరని నోటు పుస్తకం కొనుక్కోడానికి వేరే పెట్టేది. ఈ విధంగా వాళ్ళకీ, వీళ్ళకీ ఇయ్యవలసిన డబ్బునంతా వేరు చేశాక, అమ్మదగ్గర కొంచెం డబ్బే మిగిలేది. నాన్న తెచ్చిన డబ్బంతా అనేక ఖర్చులకోసం నలువైపులా వెళ్ళిపోవడం మాకు ఆ రోజుల్లో ఎంతో ఆశ్చర్యాన్ని కల్గించేది. ఆఖరికి నాన్న "నీ అకౌంటు పూర్తయిందా?" అని అమ్మను అడిగేవాడు. అమ్మ నవ్వుతూ, బుర్ర ఆడించేది. సంతోషంగా అమ్మ ఇలా జవాబిచ్చేది: "మన దగ్గర ఉన్న డబ్బుతో గడిపేసుకోవచ్చు. ప్రస్తుతం బాంకిలోనుంచి డబ్బు తీసుకోవలసిన అవసరం లేదు." దానితో మేమందరం మా గదుల్లోకి వెళ్ళిపోయి, స్కూలు పుస్తకాలను ముందు వేసుకొని, విశ్రాంతిగా మా పాఠాలను చదువుకునే వాళ్ళం.

అమ్మకి బాంకిలో డబ్బు ఉంది. అప్పుడప్పుడు ఆమె అందులో డబ్బు వేస్తూ ఉండేదనుకుంటా. కాని, ఎప్పుడూ ఆమె బాంకిలో

వేసిన డబ్బుని ముట్టుకునేది కాదు. అందు వల్లే మా అమ్మ బాంకి అకౌంటుని గురించి ఆలోచిస్తే, మా అందరికీ ఎంతో ఆశ్చర్యంగా, ఆనందంగా ఉండేది. అమ్మ బాంకి అకౌంటుని గురించి విని, మేమందరం గర్వించేవాళ్ళం. అమ్మ పేర బాంకిలో డబ్బు ఉండడం ఓ విధంగా మాకు ధైర్యాన్ని చేకూర్చేది. మాకు తెలిసిన వాళ్ళెవరికీ పెద్ద బాంకుల్లో అకౌంట్లు లేవు.

అమ్మ బాంకిలో దాచిన డబ్బు గురించి ఆలోచిస్తూ ఉంటే, మేమున్న వీధిలోనే ఒకప్పుడు నివసించిన జెన్సన్స్ జ్ఞప్తికి వస్తారు. పాపం, దురదృష్టవశాత్తూ వాళ్ళుండే ఇంటికి అద్దె చెల్లించలేక పోయారు. దాని వల్ల ఇంట్లోని వాళ్ళు అందరూ వీధిలోకి నడవవలసి వచ్చింది. చిన్నతనంలో ఉన్న మా అందరికీ ఆ దృశ్యాన్ని చూస్తూంటే, చెప్పలేనంత భయం వేసింది. వాళ్ళ సామాన్లన్నీ వీధిలోకి లాగివేయబడ్డాయి. నిస్సహాయురాలైన జెన్సన్స్ భార్య వీధిలో నిలబడి, ఏడుస్తోంది. మా అమ్మలాగే ఆమె కూడా, 'ఇది ఇంటి అద్దెకోసం,' అని డబ్బు వేరే పెట్టి ఉంటే, ఆమెకి ఈ స్థితి వచ్చేది

కాదేమో అనుకునేదాన్ని. ఆ దృశ్యం చూశాక మరో భయం కూడా నన్ను పీక్కు తినేది. జెన్సన్స్ కుటుంబానికి సంభవించిన ఆపద మాకు కూడా ఎప్పుడేనా సంభవిస్తుందా? ఆ ప్రశ్న మనస్సులో తిరిగేసరికి నాలో నేనే భయపడ్డాను. క్రిస్టినీ చెయ్యి గట్టిగా పట్టుకున్నాను.

"మనకి ఇటువంటి గతి పట్టదులే! అమ్మకి అకౌంటు ఉంది," అంది క్రిస్టినీ. దానితో నేను మళ్ళా స్వేచ్ఛగా ఊపిరి పీల్చాను.

గ్రామర్ స్కూల్లో చదువు పూర్తి కాగానే, నెల్స్ పై చదువుకి వెళ్తానన్నాడు. ఈ చదువుకి డబ్బు కొంచెం ఎక్కువ కావాలి. తనకి ఎంత ఖర్చు అయ్యేదీ నెల్స్ ఒక కాగితంమీద పూర్తిగా రాసి పట్టుకొచ్చాడు. ఇంట్లోని వాళ్ళందరం టేబుల్ చుట్టూ కూర్చున్నాం. సిగ్రెడ్ పిన్ని క్రిస్మస్ బహుమతిగా నార్వేనించి మాకు పంపిన రంగుల పెట్టెను పట్టుకొచ్చి, నేను టేబుల్ మీద పెట్టాను. ఆ పెట్టెని మేము ఒక చిన్న బాంకిగా భావించేవాళ్ళం. అర్జంటుగా ఏదేనా డబ్బు కావలిస్తే, ఆ పెట్టెను తెరిచి, అందులో దాచిన డబ్బునే ఉపయోగించేవాళ్ళం. నెల్స్

రాసిన ఖర్చు జాబితాని జాగ్రత్తగా పరిశీలించి, అమ్మ పెట్టెలో ఉన్న డబ్బుని లెక్క పెట్టింది.

"ఈ డబ్బు నీ చదువుకి సరిపోదు. కాని, వీలయినంతవరకు మనం పెద్ద బాంకికి వెళ్లి, డబ్బు తీసుకోకుండా గడుపుకోవడం మంచిది," అంది అమ్మ. అందరం బుర్రలు ఆడించాం.

"అయితే, స్కూలు మూశాక ప్రతి రోజూ కొంతసేపు డిలాన్ షాపులో పని చేస్తాను. దానిమూలంగా ఎంతో కొంత వస్తుంది," అన్నాడు నెల్సు. అన్నయ్య చెప్పింది విని, అమ్మ ఎంతో సంతోషించింది. నాన్న తీవ్రంగా ఆలోచించసాగాడు.

"నువ్వా షాపులో పని చేసినా జీతంగా వచ్చే డబ్బు నీ జాబితాని పట్టి చూస్తే, నీకు సరిపోదు. ఒక పద్ధతి నాకు మంచిదిగా తోస్తోంది. నీ చదువుకోసం నేను పైపు కాల్చడం మానేస్తాను," అన్నాడు నాన్న.

ఓసారి చిరునవ్వుతో అమ్మ నాన్న వైపు చూసింది. మెల్లగా అతని చెయ్యి పట్టుకొని, నిమిరింది. కాని, ఆమె నోటమ్మట మాట రాలేదు.

"అన్నయ్య చదువుకోసం కావలిస్తే నేనూ పని చేస్తాను. ప్రతి శుక్రవారం వెళ్ళి, ఎల్వింగ్‌టన్ పిల్లలకి ఆయాగా ఉంటాను. ఎంతో కొంత వస్తుంది," అన్నాను గర్వంగా.

"వెర్రి తల్లి!" అంది అమ్మ.

ఎలాగైతేనేం, చివరికి మా ఆర్థిక సమావేశం జయప్రదంగా ముగిసింది. అన్నయ్య పై చదువు సక్రమంగా సాగుతుంది. పెద్ద బాంకిలో వేసిన డబ్బు ముట్టుకోకుండా అతను చదువుకోగలడని అందరం సంతోషించాం.

ఇంతలో నాన్న పని చేసే కంపెనీలో స్ట్రయిక్ వచ్చింది. స్ట్రయిక్ మూలంగా మా పరిస్థితులు అంత బాగో లేదు. అయినా ఇంట్లో వాళ్ళందరం ఏదో పని చేసి, దొరికినంత సంపాదించేవాళ్ళం. మా సంపాదన మూలంగా బాంకిలోని డబ్బు తీసుకోవలసిన అవసరం మాకు పట్టలేదు. బాంకికి వెళ్ళకుండా జీవించడమంటే ఆ రోజుల్లో మా అందరికీ ఉద్రేకపూరితమైన ఒక ఆటగా కనపడేది.

ఒక ఫ్యాక్టరీలో అమ్మ పని చేసేది. నాన్న మరో చోట బుడ్లు కడుగుతూ ఉండేవాడు. వాళ్లు చేసే ఈ పనులకి ఫలితంగా మాకు రొట్టె, పాలు దొరికేవి. చివరికి స్ట్రయిక్ ఆగిపోయింది. నాన్న మళ్ళా పనిలోకి వెళ్లడం ప్రారంభించాడు. స్ట్రయిక్ పోయిందనే ఆనందంతో అమ్మ ఓసారి స్వేచ్ఛగా ఊపిరి పీల్చింది. సగర్వంగా మాతో ఇలా అంది: "చూశారా! ఈ స్ట్రయిక్ రోజుల్లో బాంకికి వెళ్లవలసి వస్తుందేమోనని ఎంతో భయ పడ్డాను. చివరికి వెళ్లకుండానే మన జీవితం సాగిపోయింది."

పై సంఘటనలన్నీ ఇరవై ఏళ్ల క్రితం జరిగాయి. సంవత్సరం క్రితం నేను మొదటి సారిగా రాసిన ఒక కథని అమ్మాను. ఆ కథకి పారితోషికంగా నాకొక చెక్కు వచ్చింది. ఆ చెక్కును చేత్తో పట్టుకుని, అమ్మ దగ్గరకు పరుగెత్తాను.

"అమ్మా, నీ బాంకిలో పడెయ్యడానికి ఇదిగో చెక్కు," అన్నాను. ఆ సమయంలో అమ్మనీ, నాన్ననీ పరిశీలనగా చూశాను. ఎందువల్లో అమ్మ చాలా ముసలిదైనట్టు నాకు అవుపడింది. నాన్న కూడా నీరసించి,

పొట్టిగా అయినట్టు అవుపించాడు. నేను ఇచ్చిన చెక్కుని చేత్తో పట్టుకుని, నాన్న వైపు అమ్మ అదో విధంగా చూసింది. ఆమె కళ్ళు గర్వంతో ప్రకాశించాయి.

"అమ్మా, రేపు ఈ చెక్కు పట్టుకెళ్ళి, నీ బాంకిలో వెయ్యి," అన్నాను.

"కాత్రిన్, నాతో నువ్వూ రావాలి," అందామె.

"నేను ఎందుకమ్మా రావటం? ఈ చెక్కు వెనక సంతకం పెట్టాను. అది సులువుగా నీ అకౌంటులో వెయ్యొచ్చు."

అదో విధంగా నవ్వుతూ, అమ్మ నా వైపు సూటిగా చూసింది.

"కాత్రిన్, నాకు ఏ బాంకిలోనూ ఎన్నడూ అకౌంటు లేదు. నిజం చెప్పాలంటే, నేను ఏ బాంకిలోకీ ఇంతవరకు అడుగు పెట్ట లేదు," అందామె.

అమ్మ చెప్పింది విని, ఆశ్చర్యపోయాను. నా నోటమ్మట మాట రాలేదు.

"చిన్నపిల్లలు భయం లేకుండా ఆత్మ విశ్వాసంతో ఉండడం మంచిది. ఏ బాంకిలోనో డబ్బు ఉందని చెపుతూ ఉంటూంటే, పిల్లలు ధైర్యంగా ఉంటారు!" అంది అమ్మ.

## 2

స్ట్రయిక్ పోయిన కొంతకాలంపాటు మా ఆర్థిక పరిస్థితి అంత బాగా లేదు. మాకేం భయం లేదని అమ్మ మరీ మరీ చెపుతూ ఉండేది. కాని, మా ఇంట్లోని ముందర గది ఖాళీ చేసి, ఎవరికేనా అద్దెకివ్వడం మంచిదని ఆమె ఒక రోజు అంది. అందరం ఒప్పుకున్నాం. ఆ వచ్చే అద్దెతో అమ్మ ఒక ఉలెన్ కోటు కుట్టించుకొంటుందని మేము ఆనందించాం. అటువంటి కోటు ఆమెకి ఎంత అవసరమో వేరే చెప్పనక్కరలేదు.

హైడ్ అనే అతను ఆ గదిని అద్దెకు తీసుకోడానికి మా ఇంటికి వచ్చాడు. అమ్మా, నేనూ అతనికి గదిని చూపించాం. "ఈ గది నాకు బాగా నచ్చింది. వెంటనే నా సామాన్లన్నీ ఇక్కడికి తెచ్చుకొంటాను," అన్నాడతను. అమ్మ అలాగే చెయ్యమంది. గదులు అద్దెకియ్యడంలో అమ్మకి అంత వరకూ ఏ మాత్రం అనుభవం లేదు. అందువల్ల అతను ఎటువంటివాడో కనుక్కోకుండా, అతన్ని ఎంతో కొంత డబ్బేనా అడగకుండా ఆమె గది అద్దెకు ఇచ్చింది.

హైడ్ ఏం వ్యాపారం చేసేవాడో నాకు తెలియదు. కాని, మా గదిలోకి చేరిన రెండు మూడు రోజుల్లోనే మా అందరితోటీ కలిసి, ఆప్తబంధువులా మసిలేవాడు. పిల్లలందరితోటీ కులాసాగా కబుర్లు చెప్పేవాడు. అమ్మని చూడగానే మర్యాదగా వంగి, నమస్కరిస్తూ ఉండేవాడు. కొన్నిరోజులయ్యేసరికి నాన్నకి కూడా హైడ్ మీద చాలా ఇష్టం పుట్టింది. కాని, జెన్నీ పిన్నికి మాత్రం హైడ్ అంటే ఒళ్ళు మండేది. ఆమెకి గదులు అద్దెకివ్వడంలో బాగా అనుభవం ఉంది.

"ఇంతకీ అతను మీ అద్దె ఎప్పుడిస్తాడో!" అంటూ ఉండేది జెన్నీ పిన్ని అమ్మతో.

"ఊరుకోవమ్మా, మనం అడగడం మర్యాదగా ఉండదు. అతనే వీలు చూసుకొని ఇస్తాడు," అని అమ్మ సర్దుతూ ఉండేది.

అమ్మ ఎంత చెప్పినా, పిన్నికి మాత్రం హైడ్ మీద నమ్మకం పుట్టేది కాదు. అటువంటి యువకుల్ని ఎందరినో ఇంతకు ముందు ఆమె చూసింది.

ఇంతలో వర్షాకాలం వచ్చింది. రాత్రిళ్ళు హైడ్ గదిలో చాలా చల్లగా ఉండేది.

అది గుర్తించి, అమ్మ హైడ్‌ని వేడిగా ఉన్న వంటింట్లోకి వచ్చి-మా అందరితోటీ కలసి కూర్చోమని ఆహ్వానించింది. ఒక దీపం ముందు క్రిస్టినీ, నెల్స్, నేనూ, మా స్కూలు పుస్తకాలు చదువుకుంటూ ఉండేవాళ్ళం. హైడ్, నాన్న పైపులు పీలుస్తూ, వేడిగా ఉన్న స్టవ్ సమీపంలో కూర్చుంటూ ఉండేవారు. అమ్మ వంట పనిలో మునిగి ఉండేది.

హైడ్ ఎంతో శ్రద్ధతో నెల్స్‌కి అర్థం కాని పాఠాలను నేర్పుతూ ఉండేవాడు. అదే కాకుండా మేమందరం విశ్రాంతిగా కూర్చున్న సమయాల్లో ఎంతో విచిత్రంగా తను చూసిన దేశాల్ని గురించీ, తను చేసిన ఘన కార్యాలను గురించీ చెపుతూ ఉండేవాడు. అబ్బ, అతనికి ఎంత తెలుసో! దేశదేశాల చరిత్రలు, భూగోళ శాస్త్రం - ఇవన్నీ సజీవంగా అతని పెదవులమీదనుంచి బయటకు జలపాతంలా దొర్లుతూ ఉంటే, నాకు ఎంతో ఆశ్చర్యంగా ఉండేది. అతను చెప్పేదాన్ని బట్టి చూస్తే, ప్రపంచమంతా ఎన్నిసార్లో చుట్టివచ్చినవాడిలా అతను అవుపడేవాడు.

ప్రతి రోజూ తన గదిలోంచి ఏదో పుస్తకాన్ని, తీసుకొచ్చి, అది గట్టిగా చదివి, మా అందరికీ వినిపించేవాడు. కొంత కాలానికి అతను చదవడం, మేము మౌనంగా వినడం ఒక రివాజు అయిపోయింది. డికెన్స రాసిన కొన్ని నవలలు పూర్తిగా చదివాక, హైడ్ మాకు షేక్స్పియర్‌ని పరిచయం చేశాడు. అతని కంఠం చాలా గంభీరంగా ఉండేది. అతను పైకి గట్టిగా చదువుతూ ఉంటే, ఏ పేరుపొందిన నటుడో స్టేజిమీద నిలబడి ఉపన్యాసం ఇస్తున్నట్లు ఉండేది. రోజులు తిరిగిన కొద్దీ వీధుల్లో పరుగెత్తి ఆడుకోవాలనే ఇష్టం కూడా మాకు పూర్తిగా నశించింది. హైడ్ చదివేది ఎప్పుడు వింటామా అనే ఆతృత మమ్మల్ని పీడించేది. చివరికి స్కాట్ రాసిన 'ఇవాన్ హో' నవలని హైడ్ చదవటం ప్రారంభించాడు. ఇంట్లో వాళ్ళందరం చెవులప్పగించి వినే వాళ్ళం. అతను ఆ నవల పూర్తి చేసేలోగా హఠాత్తుగా ఎక్కడినించో ఏదో ఉత్తరం వచ్చింది.

"నేను వెళ్ళిపోవాలి. నా గదిలో ఉన్న పుస్తకాలన్నీ మీ పిల్లలకోసం వదిలేస్తున్నా.

మీరందరూ నన్ను చాలా మర్యాదగా చూశారు. ఇప్పటివరకూ మీకు ఇయ్య వలసిన డబ్బుకి ఈ చెక్కు రాశాను. తీసు కోండి. వెళ్లొస్తాను," అన్నాడతను అమ్మతో.

హైడ్ వెళ్లిపోతూ ఉంటే, మా అందరికీ చాలా విచారకరంగా ఉంది. కాని, అతను మాకోసం వదిలేసిన పుస్తకాలని ఉత్సాహంగా వంటింట్లోకి పట్టుకెళ్లి చదవక పోయినా, పేజీలు తిప్పుతూ ఉంటే, మాకు ఎంతో ఆనందంగా ఉండేది. ఎన్ని పుస్త కాలో! పుస్తకాల పేర్లను ఆశ్చర్యంగా వల్లించుకొనేవాళ్ళం. 'ఎ టేల్ ఆఫ్ టూ సిటీస్', 'నికలాస్ నికల్బీ', 'వానిటీ ఫెయిర్' మొదలగు పుస్తకాలెన్నో హైడ్ మా ఇంట్లో వదిలివేశాడు.

అమ్మ హైడ్ వదిలేసిన పుస్తకాలన్నీ శుభ్రంగా తుడిచి, బాగు చేసింది.

"రత్నాల్లాంటి పుస్తకాలు! ఇవన్నీ చదువుకుంటే, ఎంతో జ్ఞానం వస్తుంది. ఇటుపైన ప్రతి రోజూ నెల్సె పైకి చదివితే, మనం అందరం ఆనందంగా వినొచ్చు," అంది అమ్మ.

అమ్మ చెప్పింది విని, ప్రత్యేకంగా నెల్సన్ సంతోషించాడు. హైడ్ స్థానం నెల్సన్‌కు లభించడం అతనికి అదృష్టంగా కనిపించింది.

హైడ్ వెళ్ళిపోయిన సాయంత్రం జెన్నీ పిన్ని మా ఇంటికి వచ్చింది. అతనిచ్చిన చెక్కుని అమ్మ సగర్వంగా పిన్నికి చూపించింది.

"చూశావా, డబ్బెక్కడికి పోతుంది? నువ్వు ఊరికే అనుమానిస్తావు!" అంది అమ్మ.

పిన్ని తెల్ల మొహం వేసుకుని, నిలబడి పోయింది. కాని, అదే సమయంలో మా ఇంటి సమీపంలో ఒక హోటల్ నడుపుతున్న క్రూపర్ అనే అతను అమ్మ దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చాడు. అతను చాలా కోపంగా ఉన్నాడు.

"ఆ హైడ్ ఏమి? ఉట్టి మోసగాడు! నాకు ఇచ్చిన ఈ చెక్కు గతి చూడండి! వెనక్కి తిరిగొచ్చింది. బాంకిలో చిల్లి గవ్వ కూడా లేదట," అన్నాడు క్రూపర్.

అంతవరకు వెలవెలపోతూన్న జెన్నీ పిన్ని మొహం ఒకసారి ప్రకాశవంతంగా అయింది.

"నేనేం చెప్పాను?" అందామె సగర్వంగా.

"మీకు కూడా చాలా డబ్బు బాకీ ఉన్నాడేమో?" క్రూపర్ అడిగాడు.

అమ్మ ఏం జవాబు చెపుతుందో అని మేమందరం ఆతృతగా ఉన్నాం. ఆమె మాట్లాడ లేదు. ఓసారి మౌనంగా మా అందరివైపూ చూసింది. చివరికి ఆమె చూపు నెల్సమీద కేంద్రీకరించింది.

"అబ్బాయి, ఆ ఇవాన్ హో నవల పట్రా. గట్టిగా చదువు!" అందామె.

అమ్మ మెల్లిగా స్టవ్ దగ్గరగా వెళ్లింది. హైడ్ ఇచ్చిన చెక్కుని మండుతూన్న ఆ స్టవ్‌లోకి విసిరింది. అదో విధంగా సమీపంలో నిలబడ్డ క్రూపర్ వైపు చూసింది.

"హైడ్ మాకేమీ ఇయ్యనక్కర లేదు. అతను మాకేమీ బాకీ లేడు," అందామె క్లుప్తంగా.

## 3

దాగ్మర్ చెవిలోని బాధని పోగొట్టటానికి అమ్మ అన్ని విధాలా ప్రయత్నించింది. కాని, లాభం లేకపోయింది. చివరికి డాక్టర్ జాన్సన్ దాగ్మర్‌ని చూశాడు. దాన్ని వెంటనే ఆస్పిటల్లో చేర్చాలన్నాడు.

"ఆపరేషన్ చేస్తే కాని, బాధ తగ్గదు," అన్నాడు డాక్టర్ జాన్సన్. ఆ మాటలు వినగానే అమ్మ ఎంతో భయపడిందని ఆమె మొహం చూడగానే నాకు తెలిసింది.

"ఆయన సాయంత్రం ఇంటికి వచ్చాక చూద్దాం," అంది అమ్మ.

"అది వీలు కాదు. ఈ అమ్మాయిని వెంటనే ఆస్పిటల్‌కి తీసుకెళ్ళాలి. తక్షణం ఆపరేషన్ చేయాలి."

అమ్మ గట్టిగా ఊపిరి పీల్చింది.

"అయితే అలాగే చేద్దాం," అంటూ ఇంట్లో ఉన్న రంగుల పెట్టెను పట్టుకొచ్చి, అందులో ఉన్న డబ్బును అమ్మ బల్లమీద పోసింది.

'ఇది చాలా ?' అన్నట్టు డాక్టర్ వైపు చూసింది. డాక్టర్ జాన్సన్ డబ్బు సరిపో దన్నట్టు అమ్మ వైపు చూస్తూ, ఇలా సలహా చెప్పాడు: "అమ్మాయిని క్లినిక్ ఆస్పిటల్‌లో చేర్పించండి."

"అంటే?"

"ఆ ఆస్పిటల్లో మీ శక్తినిబట్టి ఇయ్యొ వచ్చు. మీ అమ్మాయికి ఏ హానీ రాదు."

అమ్మా, నేనూ ఓసారి గాభరాతో ఆయన వైపు తిరిగాం.

"మీరేం భయపడకండి. ఆ ఆస్పిటల్లో అమ్మాయికి ఆపరేషన్ నేనే చేస్తాను."

నాన్న ఇంకా ఇంటికి రాలేదు. అందు వల్ల దాగ్‌మర్‌ని తీసుకొని, అమ్మతో నెల్సూ, నేనూ కూడా వెళ్లాం. ఆస్పిటల్ చేరుకొన్న కొంతసేపట్లో దాగ్‌మర్‌ని ఒక స్ట్రెచర్ మీద పడుకోబెట్టి, ఇద్దరు నర్సులు దూరంగా ఉన్న హాలు వైపు తీసుకు పోయారు. వాళ్ళ కూడా వెళ్లాలని అమ్మ ఎంతో తాపత్రయ పడింది.

"నా పిల్ల కూడా నేనుంటాను!" అని అమ్మ అరచింది.

"క్షమించండి. ఈ ఆస్పిటల్ రూల్స్ ప్రకారం ఎవరూ రోగి కూడా ఆపరేషన్ గదిలోకి రాకూడదు. మీరిక్కడే ఉండాలి," అంది ఒక నర్సు.

ఆఖరికి మరే గత్యంతరం లేక అమ్మా, నేనూ, నెల్సూ బయట నిలబడ్డాం. దాగ్‌మర్ ప్రవేశించిన హాలు వైపే అమ్మ తదేకంగా చూస్తోంది.

నెల్సూ, నేనూ ఆస్పిటల్‌కి వెళ్లడం ఆదే మొదటిసారి. చాలా కంగారుగా యూనిఫామ్స్ తొడుక్కుని, ఇటూ అటూ పరుగెడుతున్న నర్సులనీ, డాక్టర్లనీ చూస్తూంటే. మాకెంతో విచిత్రంగా ఉంది. ముగ్గురం ఏదో మాట్లాడడానికి ప్రయత్నించినా, మా మనస్సులు ఆపరేషన్ గదిలోనున్న దాగ్‌మర్ మీదే ఉన్నాయి. మమ్మల్ని మరిపించడంకోసం అమ్మ ఏవో కథలు అల్లి, చెప్పడం ప్రారంభించింది. ఆమె చెప్పే విధానాన్నిబట్టి చూస్తే, అమ్మ మనస్సు దాగ్‌మర్ మీదే ఉందని నాకు స్పష్టంగా తెలిసింది.

చివరికి డాక్టర్ జాన్సన్ పరుగెడుతూ, మేము నిలబడ్డ చోటికి వచ్చాడు. "ఆపరేషన్ జయప్రదంగా అయింది. మత్తు మందువల్ల దాగ్‌మర్ నిద్రపోతోంది," అన్నాడాయన.

చిరునవ్వుతో అమ్మ డాక్టర్‌కి రెండు మూడుసార్లు షేక్ హేండిచ్చింది.

"ఓసారి వెళ్లి, అమ్మాయిని చూసి వస్తాను," అంది అమ్మ.

"ఇప్పుడు కాదు; ఈ క్లినిక్ రూల్స్ ప్రకారం ఆపరేషన్ జరిగిన 24 గంటలదాకా ఎవరూ రోగులవద్దకు వెళ్ళకూడదు."

"మరేం ఫర్వాలేదు. నేనేమీ చప్పుడు చెయ్యను లెండి," అంది అమ్మ.

డాక్టర్ జాన్సన్ ఓసారి వాచ్ చూసుకొని, అర్జంటు పని ఉన్నట్టు ఆస్పిటల్ లోపలికి వెళ్ళిపోయాడు. మేం ముగ్గురం దాగ్‌మర్‌ని చూడడానికి మెల్లగా హాలు వైపు నడిచాం. ఒక నర్సు మాకు అడ్డొచ్చింది.

"మీ అమ్మాయిని ఇప్పుడు చూడ్డానికి వీల్లేదు. రేపు రండి," అందామె.

"మీ ఆస్పిటల్ రూల్స్ ఆశ్చర్యంగా ఉన్నాయి. తల్లి తన కూతుర్ని 24 గంటలు దాటిందాకా చూడలేదా?" అమ్మ అడిగింది.

"ఇక్కడ రూల్స్‌ని మేం పాటించాలి" అంది నర్స్ అధికార ధోరణిలో.

ముగ్గురం వెనక్కి తిరిగాం. బస్సెక్కి, ఇల్లు చేరుకున్నాం. క్రిస్టినీ మాకోసం భోజనాన్ని తయారుగా ఉంచింది. కాని, అమ్మ భోజనం చెయ్యలేకపోయింది. రెండు కప్పుల కాఫీ మాత్రం తాగింది.

"అమ్మాయిని చూడడానికి ఏదో పద్ధతి కనుక్కోవాలి," అంది అమ్మ చివరికి.

"ఎందుకమ్మా, అంత బెంగ పెట్టుకొంటావు? రేపు చూపిస్తారుగా!" అన్నాడు నెల్సు.

"పిల్ల ఎలా ఉందో తెలుసుకోకుండా రేపటిదాకా ఉండడం సాధ్యం కాదు నాయనా. సాయంత్రం మీ నాన్నగారొచ్చి, అమ్మాయి ఎలా ఉందని అడిగితే, ఏం జవాబు చెప్పను? చూడలేకపోయానని చెప్పనా?"

మేమందరం మాట్లాడకుండా కూర్చున్నాం. అమ్మ హఠాత్తుగా కుర్చీలోంచి లేచింది. డాగ్మర్ అనుకునే ఒక బొమ్మను పొట్లం కట్టి, జేబులో వేసుకుంది.

"వెళ్ళొస్తాను. ఈనాటి మళ్ళా ఏ నర్సు అయినా ఆపితే, డాగ్మర్‌కి ఈ బొమ్మ ఎవరో పంపారని చెప్తాను," అని అమ్మ వడివడిగా బయటకు వెళ్ళింది.

కొంతసేపయ్యాక, అమ్మ వెనక్కి తిరిగి వచ్చింది. తను కూడా పట్టుకెళ్ళిన బొమ్మ ఇంకా ఆమె చేతిలోనే ఉంది. ఆ బొమ్మను

చూడగానే ఆమె వెళ్ళిన పని జయప్రదంగా జరగలేదని నాకు అర్థమయింది.

"డాగ్మర్ ఉన్న గది దాకా వెళ్ళాను. కాని, అక్కడనుంచి ఓ నర్స్ నన్ను వెనక్కి తోసేసింది." అంది అమ్మ విచారంతో.

కాస్సేపట్లో - అంతవరకూ విచారంగా ఉన్న అమ్మ - లేచి నిలబడింది. తన గౌను మీద నడుం పైదాకా ఒక తెల్లటి గుడ్డ కట్టుకుని, వంటింట్లోని నేలని ఊడ్వడం ప్రారంభించింది.

"నీ మనస్సు బాగోలేదమ్మా. ఈ పనంతా ఇప్పుడెందుకు చేస్తావు?" అంది క్రిస్టినీ.

"ఈ గదంతా నిన్ననే శుభ్రం చేశావుగా!" అన్నాను.

"కాస్సేపట్లో భోజనాలకి టైమ్ కూడా అవుతుంది. ఇప్పుడెందుకు ఊడ్వడం?" అన్నాడు నెల్స్.

మా మాటల్ని అమ్మ పట్టించుకోలేదు తన పని అలా చేసుకుంటూనే వెళ్ళిపోయింది. చటుక్కున లేచి నిలబడి, తన చేతిలో ఉన్న బ్రష్‌ని క్రిస్టినీకి ఇచ్చింది.

"కాత్రిన్, నువ్వూ కూడా నాతో రా. ఓసారి అలా ఆస్పిటల్‌కి మళ్ళా వెళ్లి వద్దాం."

"ఇప్పుడెందుకు?" నేనడిగాను.

అమ్మ మాట్లాడకుండా ఇంట్లోంచి బయటకు నడిచింది. ఆమె వెనకనే నేనూ వెళ్ళాను. ఇద్దరం ఆస్పిటల్ చేరుకొన్నాం. ఒకచోట అమ్మ నన్ను కూర్చోమంది. తన కోటూ, హేటూ తీసి, అమ్మ నాకు అందించింది. ఆమె వైపు చూస్తూ, ఆశ్చర్యపోయాను. ఇందాక మా వంటిల్లు తుడిచేటప్పుడు ఆమె నడుంకి చుట్టుకొన్న తెల్లగుడ్డ ఇంకా అలాగే ఉంది. మాకెదురుగా ఒక స్టోర్ రూమ్ ఉంది. అమ్మ ఆ గదిలోకి వెళ్ళింది. కాస్సేపట్లో బూజులు దులిపే ఒక పొడుగాటి కర్ర చీపుర్ని పట్టుకొని, నా వైపు నవ్వుతూ చూసి, డాక్టర్ ఉన్న గది వైపు నడిచింది.

అక్కడ కుర్చీలో ఒక నర్సు కూర్చుని ఉంది. అమ్మని చూడగానే విసుక్కుంటూ ఇలా అంది. "ఎలాగైతేనేం. చివరికి ఆలస్యంగానైనా వచ్చావన్నమాట! వెళ్లు.

కుడివైపునున్న గదులు చాలా అసహ్యంగా ఉన్నాయి. మొదట అవి శుభ్రం చెయ్యి."

అమ్మ తన చేతిలో ఉన్న చీపురుతో ఈ గోడనీ, ఆ గోడనీ తుడుస్తున్నట్లు నటిస్తూ, మెల్లిగా హాలు దాటి, వెనుక వైపుకి వెళ్ళింది. మాఅమ్మ తెలివి తేటల్ని చూసి, నేనెంతో సంతోషించాను.

కాస్సేపట్లో అమ్మ మెరిసే కళ్ళతో తిరిగి వచ్చింది. తన చేతిలో ఉన్న పొడుగాటి కర్ర చీపుర్ని స్టోర్ రూమ్‌లో పడేసింది. నా దగ్గరున్న కోటునూ, హేట్ ధరించింది. ఇదంతా గమనిస్తూన్న నర్స్‌కి ఇప్పుడు అసలు రహస్యం బోధపడింది. అమ్మ ఆ నర్స్‌వైపు చూసి నవ్వుతూ, ఇలా అంది: "మీకు ధన్యవాదాలు."

ఇద్దరం ఆస్పిటల్‌లోంచి బయటకు నడిచాం.

"దాగ్‌మర్ చాలా ఆరోగ్యంగా ఉంది. దానికి ఏ జ్వరమూ రాలేదు," అంది అమ్మ.

"దాన్ని చూశావా?" ఆశ్చర్యంగా అడిగాను.

"చూశాను. అప్పుడే మేలుకుంది. నన్ను చూడగానే ఎంతో సంతోషించింది. ఇప్పుడు మనకి ఇంకేమీ భయం లేదు. మీ నాన్న అమ్మాయి ఎలా ఉందని అడిగితే, ఎంతో బాగుందని చెప్పొచ్చు."

ఇద్దరం బస్సు ఎక్కాం.

## 4

అమ్మ మేనమామ క్రిస్‌కు 'నల్ల నార్వేజియన్' అని నాన్న పేరు పెట్టాడు. క్రిస్ చామన చాయగా ఉండేవాడు. నల్లటి మీసాలు. అందుకల్లే నాన్న ఆ పేరు పెట్టి ఉంటాడేమో! మా పిన్నిలందరూ క్రిస్ హృదయం చాలా నల్లదని మరో విధంగా కూడా చెపుతూ ఉండేవారు.

క్రిస్ ఆజానుబాహుడు. అతనిది గంభీరమైన కంఠం. అతను నెమ్మదిగా ఎప్పుడూ నడిచేవాడు కాదు. అతను కుంటుతూ, చప్పుడు చేస్తూ, ఇంట్లో నడుస్తూంటే, పిల్లలందరం నలువైపులా కాకుల్లా ఎగిరిపోయే వాళ్ళం.

మా పిన్నిలందరూ కూర్చున్న సమయంలో క్రిస్ పేరు ఎప్పుడేనా వస్తే, అందరూ

పెకవులు విరిచేవారు. అతన్ని గురించి ఏవేవో చెప్పుకొనేవారు. ఆ సంభాషణ వినకుండా ఉండే దుకు పిల్లల్నందరినీ గదిలోంచి బయటకు పొమ్మనేవారు.

ఏది ఎలాగున్నా క్రిస్ కుటుంబ యజమాసిలాగే ప్రవర్తించేవాడు. మా పిన్నిలకి ఎంత వయస్సు వచ్చినా, వాళ్ళందరూ తెలివి లేని పసిపాపలన్నట్లు క్రిస్ వాళ్ళని చూసేవాడు.

కాని, అమ్మంటే మాత్రం క్రిస్‌కి ఎంతో గౌరవం ఉండేది. అమ్మ మొహం చూస్తే, చిన్నతనంలో తను కోల్పోయిన తల్లి రూపం క్రిస్‌కి జ్ఞాపకం వస్తూంటుందని నాన్న అనే వాడు. అదే కాకుండా, అక్కచెల్లెళ్ళందరిలోనూ అమ్మ ఆఖరిది అవడంవల్ల క్రిస్‌కి ఆమె మీద ప్రేమ, గౌరవం ఉండేవట.

అమ్మకు కూడా క్రిస్ అంటే ఎంతో ఇష్టం. సాధారణంగా అతన్ని మెచ్చుకుంటూనే ఆమె మాట్లాడుతూ ఉండేది.

"పాపం, క్రిస్ కుంటివాడు!" అనేది అమ్మ. కాని, పిన్నిలందరికీ అమ్మ చూపించే జాలి కోపాన్ని పుట్టించేది. అతను మంచి వాడు కాడని వాళ్ళందరూ అంటూండేవారు.

క్రిస్ లేని సమయాల్లో అతన్ని వాళ్ళు ఎంత తిట్టినా, అతన్ని చూడగానే మౌనంగా ఉండి పోయే వారు. తన గంభీరమైన కంఠంలో అతను వాళ్ళను మందలిస్తూ ఉంటే, జవా బిచ్చే ధైర్యం ఏ పిన్నికీ ఉండేది కాదు.

పిన్నిల అదృష్టం కొద్దీ క్రిస్ చాలా తక్కువ కాలంపాటు ఇంట్లో ఉండేవాడు. సంవత్సరం పొడుగునా దేశద్రిమ్మరిలా తిరు గుతూ ఉండేవాడు. ఏవో భూములు కొని, వాటిని లాభాలకు అమ్ముతూ ఉండేవాడు. అతనిలా వచ్చే డబ్బంతా ఎలా తగలేస్తు న్నాడో అని పిన్నిలందరూ సాధారణంగా చర్చించేవారు.

క్రిస్ ఇంటికి రావడంతోటే ఇల్లంతా చాలా హడావిడిగా, గందరగోళంగా అయి పోయేది. పిల్లల్నందరినీ ఒక లైనులో నిలబెట్టి, అతను మాకేసి నవ్వుతూ చూసేవాడు. మా అందరికీ ఏవో ఉపదేశాలు ఇస్తూండేవాడు.

"నడుం వంచకూడదు. నిలువుగా నిల బడాలి!"

"ఇదిగో, నీ పళ్ళు ఇంకా బాగా తోము కోవాలి."

అతను ఏం చెప్పినా, మేం బుర్రలు ఆడించేవాళ్ళం.

"ఈ అమ్మాయి చాలా నీరసంగా ఉంది. దానికి నారింజపళ్ళ రసం ఇచ్చి చూడు," అనేవాడు క్రిస్ అమ్మతో.

తను వెళ్ళిపోగానే ఎక్కడినుంచో ఒక బుట్టెడు నారింజ పళ్ళు మాకు పంపించే వాడు.

"పిచ్చి పళ్ళు! ఇంత పుల్లగా ఉన్న వాటిని ఎవరు తింటారు?" అనేది మార్తా విసుగ్గా.

కాని, మా పిల్లలందరికీ ఆ పుల్లటి నారింజ పళ్ళే ఎంతో రుచిగా ఉండేవి.

"క్రిస్ ఉట్టి పిసినారి. అతను సాధారణంగా నారింజ పళ్ళే దానం చేస్తూ ఉంటాడు," అనేది సీగ్రెడ్ పిన్ని.

"మరేం ఇస్తాడు? ఉన్న డబ్బంతా అతను తాగటానికే కావాలిగా?" అనేది జెన్నీ పిన్ని.

జెన్నీ పిన్ని చెప్పింది విన్నదాకా, క్రిస్ తాగుతాడనే విషయం మాకు తెలియదు. మా పిన్నిల సంభాషణల ద్వారా మరి కొన్ని విషయాలు కూడా మాకు తెలి

శాయి. వంశపారంపర్యంగా వస్తూ ఉన్న కొన్ని అమూల్యమయిన వస్తువులను క్రిస్ నిర్లక్ష్యంగా అమ్మివేశాడుట. ఆ వస్తువులు అమ్మవద్దని పిన్నిలందరూ ఎంతో పోట్లాడారట. కాని, అతను వాళ్ళ మాటలసి లెక్క చెయ్యలేదు.

"మన శరీరంలో రాజుల రక్తం ప్రవహిస్తోంది. అటువంటి మనకి ఆభరణాలు కావాలా?" అని క్రిస్ వాళ్ళని ఎదిరించాడని విన్నాను.

అవన్నీ అమ్మివెయ్యగా వచ్చిన డబ్బుతో అతను ఏం చేసిందీ కూడా వాళ్ళకి చెప్పలేదు.

ట్రీనా పిన్ని కట్నం విషయంలో కూడా ఇటువంటి సంఘటనే జరిగింది. చాలా సంవత్సరాలపాటు ఆమెకి పెళ్ళి కాదేమో అని అందరూ భయపడ్డారు. అదృష్టవశాత్తూ తిక్కెల్సన్ అనే అతన్ని ఆమె కలుసుకొంది. అతను పొట్టిగా, జంకుతూ ఉండేవాడు. తిక్కెల్సన్ ట్రీనాని పెళ్ళి చేసుకోడానికి ఒప్పుకున్నాడు. అంతవరకూ ట్రీనా కట్నం కోసం దాచబడ్డ డబ్బు అతనికి ఇయ్యబడింది. ఆదే సమయంలో క్రిస్ ఎక్కడినుంచో పిడు

గులా ఇబ్బందిపడ్డాడు. క్రిస్‌ని చూసిన మరు క్షణం నుంచీ రిక్ కెల్సన్ గుండె దడదడ కొట్టు కోసాగింది. క్రిస్ అతన్ని క్రాసు పరీక్ష చేసి. చాలా విచిత్రంగా అప్పుడే అతనికి పుట్టిన కట్నాన్ని చమత్కారంగా అతనివద్దనుంచి లాక్కున్నాడు. ఆ తరువాత క్రీనా పెళ్ళి కాదేమోనని అందరూ భయపడ్డారు. ఎలాగో పెళ్ళి అయింది. కాని, కట్నం మాత్రం క్రిస్ పట్టుకొని ఎక్కడికో వెళ్ళి పోయాడు.

క్రిస్ ఇదే విధంగా ఎన్నో అద్భుతాలు చేస్తూ ఉండేవాడు. మార్తా చిన్న కొడుకు ఆర్నీ బండిలోంచి క్రిందపడి, మోకాలుమీద గాయపడ్డాడు. మోకాలంతా బాగా వాచింది. మార్తా చిన్న పిడికిట్లు కడుతూ ఉండేది. కాని, గాయం తగ్గలేదు. అప్పుడే క్రిస్ ఎక్కడినుంచో మళ్ళా ఇంటికి వచ్చాడు. ఆర్నీ మోకాలు మీదనున్న గాయాన్ని చూడగానే సింహంలా గర్జిం చాడు. ఎవ్వరినీ అడక్కుండా, తనదే రాజ్యం అన్నట్టు, ఆర్నీని ఏదో ఆస్పిటల్‌కి తీసు కెళ్ళి, మోకాలుమీద ప్లాస్టర్ వేయించి, మళ్ళా ఇంటికి తీసుకు వచ్చాడు. తనతో చెప్ప

కుండా తన కొడుకును తీసుకెళ్లి ఇదంతా చేసినందుకు మూర్తా పిన్నికి క్రిస్ మీద చెప్ప లేనంత కోపం వచ్చింది.

"ఉష్! ఆడవాళ్ళు! మీతో కూడా చెప్పాలా?" అని క్రిస్ ఊరుకొన్నాడు.

తరువాత క్రిస్‌ను గురించి చాలా కాలం పాటు మేం వినలేదు. చివరికి అతనిదగ్గరనుంచి ఒక ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం ద్వారా అతను ఏ క్షణంలోనైనా చనిపోవచ్చని మేం అందరం తెలుసుకున్నాం. అందరం బయల్దేరి, అతనున్న ఊరికి వెళ్లాం. ఇంట్లో అడుగు పెట్టేసరికి క్రిస్ కేకలు మాకు వినపడ్డాయి.

"త్వరగా విస్కీ బుడ్డి పట్టుకొచ్చి నా కివ్వండి," అంటున్నాడతను. అప్పుడు అమ్మ అతనున్న గదిలోకి వెళ్లింది.

"క్రిస్, తాగడానికి సమయం కాదిది. నీ ఆరోగ్యం బాగో లేదు," అంది అమ్మ.

కొంతసేపటివరకూ తదేకంగా అతను అమ్మని చూశాడు. తర్వాత మెల్లగా అతని చూపు గదిలో నిలబడ్డ పిన్నిలందరి మీదకీ వెళ్లింది.

"మీరందరూ ఇక్కడికి ఎందుకు వచ్చారు? చావంటే నాకు భయం లేదు! వెళ్లండి బయటికి," అని అరిచాడు అతను.

అందరితోటీ నేను కూడా బయటకు వెళ్లాను. అమ్మ మాత్రం గదిలో ఉంది.

ముందర హాల్లో మేమందరం కూర్చున్నాం. కాస్సేపట్లో అమ్మ అదో విధంగా చూస్తూ, మా దగ్గరికి వచ్చింది.

"క్రిస్ వెళ్లిపోయాడు," అంటూ తన తలని నాన్న భుజంమీద వాల్చింది.

ట్రీనా పిన్ని ఏదో చెప్పబోతూన్నట్లు రెండు మూడుసార్లు దగ్గింది. ఇంతలో అమ్మ లేచి నిలబడి, తన జేబులోంచి ఒక చిన్న పుస్తకాన్ని బయటకు తీసి పట్టుకుంది. అందరూ అమ్మ చేతిలో ఉన్న ఆ పుస్తకం వైపే చూశారు.

"ఏమిటది? అతను రాసిన వీలునామా!" ట్రీనా పిన్ని ఆత్రుతగా అడిగింది.

"ఇది వీలునామా కాదు. వీలునామా రాయడానికి క్రిస్ దగ్గర ఒక్క చిల్లిగవ్వ కూడా లేదు. అతని జీవితంలో గడించిన డబ్బంతా ఏ విధంగా ఖర్చుపెట్టిందీ ఈ పుస్తకంలో రాశాడు," అంది అమ్మ దీనంగా.

అమ్మ ఇచ్చిన జవాబుతో గదంతా నిశ్శబ్దంగా అయిపోయింది. తన పోయిన కట్నం కోసం టీనా పిన్ని వెక్కి వెక్కి ఏడ్వ సాగింది. అందరు పిన్నిలు కూడా అప్పుడే చనిపోయిన క్రిస్‌ని నిందిస్తూ, పెదవులు విరుచుకొన్నారు. అందరివైపూ ఓసారి చూసి, అమ్మ ఇలా చెప్పింది: "క్రిస్ ఎటువంటివాడో మీ కెవ్వరికీ తెలియదు. అతను డబ్బుని దుర్వినియోగం చెయ్యలేదు. ఈ పుస్తకంలో అతను తన డబ్బుని ఏ విధంగా ఖర్చుపెట్టిందీ రాశాడు. కాత్రిన్, ఈ పుస్తకం తీసుకొని, అందులో రాసినదంతా గట్టిగా చదువు."

అమ్మ ఇచ్చిన పుస్తకాన్ని తీసుకొన్నాను. క్రిస్ దస్తూరీని పోల్చి చదవడానికి చాలా కష్టపడ్డాను. చివరికి గట్టిగా ఇలా చదవ సాగాను: "జోసఫ్ స్పైనెల్లీ. నాలుగేళ్ళ కుర్రవాడు. ఎడమ కాలి ఎముకల్ని క్షయ ఆవరించింది. అతనికోసం 237 డాలర్లు ఖర్చు పెట్టాను. ఇప్పుడతను హాయిగా నడుస్తున్నాడు. జైమ్ కెల్లీ. 9 ఏళ్ళుంటాయి. వంకర

కాళ్ళు. 433 డాలర్లు అతనికోసం వ్యయ పర్చాను. ఇప్పుడు అతను నడుస్తున్నాడు."

ఇదే విధంగా పేజీ తర్వాత పేజీ తిప్పి, నేను చదువుతూ పోయాను. ఇంకా ఎంత మంది పేర్లో ఉన్నాయి. అతని డబ్బంతా క్రిస్ అభాగ్యులకోసమే ఉపయోగించాడు. చివరికి ఊపిరి గట్టిగా పీలుస్తూ, ఇక చదవ లేకపోయాను. గదిలో ఉన్న వాళ్ళందరినీ ఓసారి కలయ చూసి, అమ్మ ఇలా అంది :

"క్రిస్‌ది చాలా గొప్ప హృదయం. ఎంతమందికో సేవ చేశాడు. ఈనాడు అతను పోయినా, అనేకమంది అతని మూలంగా ఈ లోకంలో హాయిగా జీవిస్తున్నారు."

అమ్మ చెప్పిన మాటలు వినగానే అందరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు. అంతవరకూ తన కట్నం పోయిందని ఏడుస్తున్న క్రిటీనా పిన్ని కళ్ళు తుడుచుకొని, మా అందరికీ కాఫీ చేసి ఇస్తానంది. మార్తా పిన్ని ఓసారి తన కొడుకు అర్నీని దగ్గరగా లాక్కొని, అతన్ని ముద్దు పెట్టుకొంటూ, ఇలా అంది: "క్రిస్ నిన్ను ఆస్పిటల్‌కి తీసుకెళ్లకపోతే, నీ కాలు ఉండేది కాదేమో!"

"క్రైస్ట్ చేసినదంతా మంచే!" అంది అమ్మ కుస్తాంగా.

హాలులో కూర్చున్న వాళ్ళందరూ అవు నన్నట్లు బుర్రలు ఆడించారు.

## 5

నాన్న చాలా కష్టపడి పని చేసేవాడు. దాని వల్ల మా పరిస్థితులు కొంత బాగు పడ్డాయి. మా చిన్న పెట్టెలో మేం దాచు కొన్న డబ్బు రోజు రోజుకీ పెరిగింది. త్వర లోనే మరో తమ్ముడో, చెల్లెలో రావచ్చని అమ్మ చెబుతూ ఉండేది.

అదే సమయంలో, బంగళాలు అమ్మే ఒక తను నాన్నను కలుసుకొన్నాడు. కొంత దూరంలో—సముద్రానికి దగ్గరగా—ఒక మంచి రాంచ్ (పసువుల బీడు) అమ్మకానికి ఉందని నాన్నతో చెప్పాడు. ఎంతో కొంత డబ్బు ముందుగా ఇచ్చి, మిగిలినదంతా అద్దె రూపంలో చెల్లించవచ్చని అతను నాన్నని ఆశ పెట్టాడు. ఆ రాంచ్ లోని అయిదెకరాల పళ్ళ తోట కూడా మనకు చెందుతుందని అతను అన్నాడు.

"ఆలోచించండి! కావలసినంత సూర్య కాంతి. పొగమంచు ఉండదు," అన్నాడతను చివరికి.

"పొగమంచు ఉంటే, శరీరానికి మంచిదే," అంది అమ్మ అతనికి అడ్డొస్తూ.

"మీాకక్కడ కోడి గుడ్లు కూడా బాగా దొరుకుతాయి! కావలసినన్ని పాలు!" అన్నాడతను– చెప్పవలసిందంతా బట్టీ పట్టినట్టు.

"ఆవులున్నాయా?" నాన్న ఆత్రుతగా అడిగాడు.

"ఆవులు లేవు. కాని, నాలుగు మేక లున్నాయి."

నిజం చెప్పాలంటే, అమ్మకి ఆ రాంచ్ కొనడం అంటే అంత ఇష్టం లేదు. ఎల్ల కాలం వృద్ధంగిగా ఉండకుండా మరో పనేదో చేసుకోడం – నాన్న మంచిదన్నాడు. ఎంత చిన్న ఇల్లయినా అది తనదయితే, ఆనందంగా ఉంటుందన్నాడు నాన్న. దాని మూలంగా చివరికి ఆ రాంచ్ కొనుక్కున్నాం. అందరం బదిలీ అయ్యాం.

రాంచ్‌లో చేరిన మరుక్షణంనుంచీ మా అందరికీ ఎన్నో పనులు కనిపించాయి. ఇంటి

కప్పుని బాగు చెయ్యడం, దూరంగా ఉన్న నూతినుంచి నీళ్ళు తోడి ఇంటికి పట్టుకు రావడం, ఉపయోగించని చెట్లను నరకడం... ఈ పనులన్నీ చేస్తూంటే, మాకెంతో ఆహ్లాదంగా ఉండేది. డాగ్‌మర్ కూరగాయల తోట వెయ్యడంలో అమ్మకి ఎంతో సహాయ పడింది. క్రిస్టినీ, నేనూ మేకపాలు పితుకుతూండేవాళ్ళం.

కాని, చలికాలం వచ్చేసరికి మా ఉత్సాహం అంతా అడుగంటింది. పొద్దుటే బద్ధకంగా పరుపులమీదనుంచి లేచి, భోజనం చెయ్యడమన్నా, హరికెన్ లైటు ముందు కూర్చొని చదవడమన్నా మాకు ఎల్లాగో ఉండేది. మేము చదువుకొంటున్న స్కూల్ కూడా మా కళ్ళకి చాలా చిన్నదిగా అవుపడేది. మేము ఉన్నచోట రంగుల రాట్నాలు లేవని డాగ్‌మర్ విచారించేది. పెద్ద లైబ్రరీలు లేవని నెల్స వాపోయాడు. హాయిగా షికారు వెళ్ళడానికి కార్ప్కులు లేవని నేనూ, క్రిస్టినీ విచారించే వాళ్ళం. నాన్న మాత్రం తోటని బాగు చేయాలని ఎంతో కష్టపడే వాడు. కాని, మొక్కలు ఎదిగేలోగానే నేల కూలుతూ ఉండేవి. మేము పెంచుతున్న

కోళ్ళన్నీ ఏవేవో రోగాలకి గురి అయ్యాయి. కొన్ని కోళ్ళు చివరికి చచ్చిపోయాయి. మిగిలినవి స్ట్రయిక్ చేసినట్లు గుడ్లు పెట్టడం మానివేశాయి. మేకలు మాత్రం ఎప్పటిలాగే పాలు ఇస్తున్నాయి.

కొత్త సంవత్సరం రాత్రి 12 గంటలకి ప్రవేశించబోతోంది. కాని, పెద్ద పెద్ద పాపులూ అవీ చూసే అవకాశం మాకు చిక్కలేదు. అమ్మ తయారు చేసిన తియ్యటి సూప్ ని అందరం తిన్నాం. రాత్రి 12 కొట్టే సరికి అమ్మ చెయ్యి పైకెత్తి, "వినండి," అని కేక వేసింది.

ఏం వినాలో మాకు తెలియలేదు. నిజం చెప్పాలంటే మాకు ఏ ధ్వనీ వినపడలేదు.

"శాన్ ఫ్రాన్సిస్కో పట్టణంలో గంటలు మోగుతున్నాయి, వినండి!" అంది అమ్మ మళ్ళా.

"అదంతా నువ్వు ఊహిస్తున్నావు. శాన్ ఫ్రాన్సిస్కో మనం ఉన్న రాంచ్ కి చాలా దూరం," అన్నాడు నాన్న.

అందరం అమ్మవైపు చూశాం. అమ్మ కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయేమో అనిపించింది. అమ్మకి శాన్ ఫ్రాన్సిస్కో పట్టణం

అంటే చాలా ఇష్టం. ఆమె అమె రికా రాగానే మొదటిసారిగా అదే పట్టణంలో కాలు పెట్టిందట. అప్పటినుంచీ ఆమెకు శాన్ ఫ్రాన్సిస్కో అంటే చెప్పలేనంత ప్రేమ ఏర్పడింది. ఆమె ఎక్కడున్నా ఆమె ఆలోచన లన్నీ ఆ పట్టణంమీదకే వెళ్తూ ఉండేవి.

చాలా దూరంగా ఉన్న ఈ రాంచ్ ని అమ్మివెయ్యడానికి నాన్న నిశ్చయించు కొన్నాడు. కాని, కొన్నంత సులువుగా అమ్మడం సాధ్యం కాలేదు. సాండర్ మన్ అనే దంపతులు వచ్చి, ఓసారి మా రాంచ్ ని చూసి వెళ్లారు. ప్రత్యేకంగా గోళ్ళంటే వాళ్ళకి ఎక్కువ ఇష్టం. చివరికి మా రాంచ్ ని కొనడానికి ఒప్పుకున్నారు. కాని, ఒక్కటే తంటా ఏర్పడింది. వాళ్ళకి స్పెన్సర్ వీధిలో 11 గదులున్న ఒక పెద్ద ఇల్లు ఉందట. అది అమ్మితేగాని, మా రాంచ్ కొనడం వాళ్ళకి వీలు కాదని మాతో చెప్పి, ఆ దంప తులు వెళ్ళిపోయారు. అదే సమయంలో మమ్మల్ని అందరినీ చూడడానికి జెన్నీ పిన్ని వచ్చింది.

"ఏమిటి? పిల్లలందరూ ఇలా అయి పోయారు?" అని పిన్ని అడిగింది - మమ్మల్ని చూస్తూ.

ఏం, బాగో లేరా?'' అమ్మ ఎదురు ప్రశ్న వేసింది.

"వాళ్ళ మొహాలు చూస్తే, వెలవెల పోతున్నాయి. ఇక్కడనుంచి వెంటనే మరో చోటికి మకాం మార్చడం మంచిదను కుంటా," అంది జెన్నీ పిన్ని.

చివరికి మరో చోటికి పోవడానికి అమ్మ నిశ్చయించుకొంది. త్వరలోనే మేమందరం సాండర్‌మన్ దంపతుల 11 గదులున్న భవ నానికి బదిలీ అయ్యాం. జెన్నీ పిన్ని కూడా మాతోటే ఉంది. మేం ఆ ఇంట్లోకి బదిలీ అయిన రోజు మాకెంతో ఉత్సాహకరంగా ఉంది. కొత్తగా ఉన్న ప్రదేశాన్ని మేం అందరం అన్వేషిస్తూ ఆడుకొన్నాం. చీకటి పడటంతోటే అందరం ఇల్లు చేరుకొన్నాం. ఇంట్లో అడుగు పెట్టేసరికి పిన్నిలందరూ కూడా మాకు అడ్డపడ్డారు. జెన్నీ పిన్ని నవ్వుతూ మా దగ్గరగా వచ్చి, ఇలా చెప్పింది:

"ఈ ఇంట్లో ప్రవేశించిన రోజు మంచిది. ఇప్పుడే మీకొక కొత్త చెల్లాయి పుట్టింది."

జెన్నీ పిన్ని కూడా అందరం హాలు దాటి, అమ్మ పడుకొన్న గదిలోకి వెళ్ళాం. మెల్లిగా అమ్మ దగ్గరగా వెళ్లాం. అమ్మ పక్కనే ఓ చిన్నపాప పడుకొని ఉంది.

"దీని పేరు కారెన్," అంది అమ్మ.

## 6

స్ప్రినర్ వీధిలో ఉన్న ఆ పెద్ద ఇంట్లో ఉండడం మాకందరికీ ఏదో కొత్త జీవితం ప్రారంభించినట్లు ఉండేది. ఇంతవరకూ మేడ ఉన్న ఇంటిలో మేం ఎప్పుడూ ఉండలేదు. ఈ ఇల్లు చాలా విశాలంగా ఉంది. కావలసినన్ని గదులున్నాయి. వంటిల్లు కూడా విశాలమైనదే.

ఆ ఇంట్లోని కొన్ని గదులను బయటి వాళ్ళకు అద్దెకియ్యవచ్చని జెన్నీ పిన్ని కూడా వప్పుకొంది. మూడు గదుల్లో మేం అందరం ఉండడానికి నిశ్చయించుకొన్నాం. తతిమ్మా గదులన్నీ అద్దెకివ్వాలనుకొన్నాం. అద్దెకిచ్చే గదుల్లో కావలసిన కుర్చీలూ, టేబుల్సూ ఉంటేగాని ఎవరూ అద్దెకు తీసుకోరని జెన్నీ పిన్నికి బాగా తెలుసు. కాని, మా ఇంట్లో కుర్చీలు, టేబుల్సు

కొద్దిగానే ఉన్నాయి. చివరికి ఒక నిశ్చయానికి వచ్చాం. ఒక్క గదిని మాత్రం మొదట్లో అద్దెకిచ్చి, దాని మూలంగా వచ్చిన డబ్బు ద్వారా కుర్చీలూ, బల్లలూ కొని, తతిమ్మా గదులను అలంకరించాలనుకున్నాం.

ఆ రోజుల్లో ఇంటి విషయాల్లో నేను కూడా ఇంతో అంతో అధికారం వహించే దాన్ని. బయటి వాళ్ళ ముందు ఇంట్లో వాళ్ళందరూ నన్ను కేథరీన్ అని పిలుస్తూ ఉండేవారు.

విన్‌ఫోర్డ్ స్కూల్ మా ఇంటికి సమీపంగా ఉంది. ఆ స్కూల్‌లో ఆడపిల్లలు మాత్రమే చదువుకొనేవారు. మా ఇంటి పక్క నివసించే శ్రీమతి కార్బ్ ఆ స్కూల్‌ని ఎంతో పొగుడుతూ చెప్పేది. మొదట్లో ఆ స్కూలంటే నాకంత ఇష్టంగా ఉండేది కాదు. నిజం చెప్పాలంటే స్కూల్‌లో మొగపిల్లలు కూడా ఉంటే, ఆడపిల్లలకి ఎంతో ఉత్సాహంగా ఉంటుంది. ఈ అభిప్రాయాన్ని ఆ రోజుల్లో నేను పెద్దలతో చెప్పలేకపోయాను. అందువల్ల క్రిస్టినీ, డాగ్మర్, నేనూ అదే స్కూల్లో చేరడానికి వెళ్ళాం.

కొత్తగా పుట్టిన పాపతో అమ్మకి తీరిక ఉండేది కాదు. అందువల్ల చెల్లెళ్ళిద్దర్నీ వెంట బెట్టుకొని, నేనే విన్‌ఫోర్డ్ స్కూల్‌కి వెళ్ళి, ప్రిన్సిపాల్‌ను కలుసుకొన్నాను. ఆమె పేరు మిసెస్ గ్రిమ్స్. ఆమె జుట్టు ఎందువల్లో విరబోసుకొన్నట్టు ఉండేది. ఆమె కళ్ళద్దాలు చూస్తూంటే, నవ్వు ఆపుకోలేకపోయాను.

"ఎవరివైపూ అలా తీక్షణంగా చూడ కూడదు!" అందామె—నాకేసి అదో విధంగా చూస్తూ.

నేను జవాబియ్యలేదు. మీ పేర్లేమిటని ఆమె అడిగింది. ముగ్గురి పేర్లూ చెప్పాను.

"స్వీడన్ దేశంనుంచి వస్తున్నారన్న మాట!" అందామె.

"కాదు; మా దేశం నార్వే," అన్నాను సగర్వంగా.

ప్రిన్సిపాల్ నన్ను వెక్కిరిస్తున్నట్టు భుజాలు ఊపింది.

"స్వీడన్, నార్వే—రెండు దేశాలూ ఒకటేలే!"

"రెండు దేశాలూ ఒకటి ఎలా అవుతాయి?" అని ప్రశ్నించాను.

ఓసారి కోపంగా ఆమె నావైపు చూసింది.

"మీరా రిక్కడికి చదువుకోడానికి వచ్చారు. పెద్దల్ని ఎప్పుడూ ఎదిరించ కూడదు. నేనేం చెప్పినా ఊరుకోవాలి."

ప్రిన్సిపాల్ చెప్పిన పై మాటలతో ఆమె మీద నాకున్న గౌరవం అంతా పూర్తిగా అడుగంటింది. అమ్మ, మామయ్య క్రిస్ ఆ క్షణంలో అక్కడ ఉండి ఉంటే, ఒక్కసారి ఆమెమీదకి ఎగిరిపడేవారు. స్వీడన్, నార్వే ఈ రెండు దేశాలూ ఒకటే అని ఆమె అనడం నేను సహించినా, క్రిస్ సహించి ఉండేవాడు కాదు.

అదే సమయంలో మరో స్త్రీ ప్రిన్సిపాల్ ఆఫీసులోకి వచ్చింది. పొడుగ్గా, సన్నగా ఉంది. ఆమె పెదవులమీద చిరునవ్వు చూస్తే, కొంచెం దయ కలిగిన ఆమెలా అవుపడింది.

"మిస్ లమున్స్, వీళ్ళు ముగ్గురూ మన స్కూల్లో చేరడానికి ఇప్పుడు వచ్చారు," అంది ప్రిన్సిపాల్—మమ్మల్ని కొత్తగా వచ్చి నామెకి పరిచయం చేస్తూ.

"చాలా సంతోషం. మరో ముగ్గురు కొత్త యువతులు మన విద్యామందిరంలో

ఈ నాడు ప్రవేశిస్తున్నారన్న మాట!"
అంటాదామె.

కాని, లయన్స్ చెప్పిన మాటల్ని వినగానే ప్రిన్సిపాల్ ఓసారి ఉరుముతూ, ఆమె వైపు చూసింది.

"విద్యామందిరం! పేరు పెద్దదే. ఈ స్కూలు పేరు ప్రఖ్యాతులు రోజురోజుకీ క్షీణించిపోతున్నాయి. ఒకానొకప్పుడు ఈ స్కూల్లో పెద్ద పెద్ద వాళ్ళ కూతుళ్ళు చదివేవారు. ఇప్పుడో! నార్వేనుంచీ, స్వీడన్ నుంచీ విద్యార్థులు వస్తున్నారు. మరికొంత కాలం పోతే, నీగ్రోలుకూడా ఈ స్కూల్లోనే చదువుకొంటారు."

ప్రిన్సిపాల్ మాటలు వినగానే నాకు చాలా కోపం వచ్చింది. నా పక్కనే నిలబడ్డ దాగ్మర్ చెయ్యిని గట్టిగా పట్టుకొన్నాను. అంతర్గతంగా నేను నీగ్రో స్త్రీని కానని ఆనందించాను. సమీపంలో నిలబడ్డ క్రిస్టినీ వైపు ఓసారి చూశాను. దాని మొహంలో ఎటువంటి కోపమూ నాకు అవుపడలేదు. శాంతిమయంగా క్రిస్టినీ కిటికీలోంచి బయటకు చూస్తోంది. ఆ క్షణంలో దాన్ని చూసి, ఇంతో అంతో ఈర్ష్య పడకుండా ఉండలేక

పోయాను. అటుపైన మేం ముగ్గురం ఏ ఏ క్లాసుల్లోకి వెళ్లి కూర్చోవలసిందీ ప్రిన్సిపాల్ నిర్ణయించింది. ప్రిన్సిపాల్ సెలవు తీసుకొని, నేను చెల్లెళ్ళిద్దర్నీ వెంటబెట్టుకుని, క్లాసులు జరుగుతున్న గదులవైపు నడిచాను.

క్రిస్టినీ, డాగ్మర్‌లను వాళ్ళ క్లాసుల్లో విడిచిపెట్టి, తిన్నగా నా క్లాసుకి వెళ్ళాను. కొన్ని నిమిషాలపాటు గుమ్మంలో నిలబడి, పూర్తిగా ఆడపిల్లలతో నిండిన ఆ గదివైపు చూశాను. అందరి కళ్ళూ నామీదే ఉన్నాయి. మిస్ స్కాన్‌లన్ నన్ను చూడగానే, నా బూట్ల ధ్వని వినగానే పాఠాలు చెప్పడం మానివేసింది. అంతమంది చూస్తూండగా గదిలోకి వెళ్ళడం నాకు ఎంతో సిగ్గుగా అనిపించింది. ప్రిన్సిపాల్ ఇచ్చిన చీటీని మిస్ స్కాన్‌లన్‌కి చూపిద్దామని ఆమె దగ్గరగా వెళ్ళాను. గదిలోని పిల్లలందరూ నన్ను విచిత్రంగా చూసి, అనేక రకాలైన ధ్వనులు చేస్తున్నారు. ఒక మూలనుంచి సిగ్గూ, రెండో వైపున భయం నన్ను ఆవహించాయి. నా చేతిలో ఉన్న చీటీ నేలమీదికి జారింది. వంగి దాన్ని తీస్తూంటే, గదిలోని ఆడపిల్లలందరూ మళ్ళీ ఫక్కున నవ్వారు.

"ఊరుకోండి. సైలెన్స్!" అని అరిచింది మిస్ స్కాన్లన్.

చివరికి ఎలాగైతేనేం, క్లాసు వెనుక భాగంలో ఉన్న ఒక బల్లమీద కూర్చున్నాను. కూర్చున్న కొంతసేపట్లో నా మనస్సు కొంత శాంతపడింది.

నా క్లాస్‌మేట్‌లందరూ నన్ను ఎందువల్లో శత్రుభావంతో చూసేవారు. నల్లగా ఉన్న ఒక అమ్మాయి మాత్రం నన్ను చూసి నవ్వి, నా దగ్గరగా వచ్చింది.

"నా పేరు వానెట్టీ. నేనూ నీలాగే ఈ స్కూల్‌లో కొత్తగా చేరాను," అంది ఆ అమ్మాయి. అంత ఆప్యాయంగా నా దగ్గరికి వచ్చి, నన్ను ఆమె పలకరించినందుకు నేను ఎంతో సంతోషించాను.

"మన క్లాసులోని పిల్లలు ఏదేనా అంటే పట్టించుకోకు. కొత్తగా వచ్చిన వాళ్ళని చూసి, వాళ్ళందరూ పరిహాసంగా కేకలు వేస్తూ ఉంటారు."

నేను మెల్లిగా నవ్వి ఊరుకున్నాను. కొంతసేపట్లో విచిత్రంగా ఉన్న నా బట్టలని చూసి, క్లాసులోని వాళ్ళు అందరూ నవ్వి ఉంటారని వానెట్టీ ద్వారా తెలుసు

కొన్నాను. నాలో మాత్రం ఒక విశ్వాసం ఉంది. స్కూల్‌లో చేరిన మొదటి రోజుల్లో వాళ్ళందరూ ఇలా నవ్వినా, కొంతకాల మయ్యేసరికి వాళ్ళు నన్ను స్నేహభావంతో చూస్తారనే నమ్మకం నాకు బాగా ఉంది.

స్కూల్‌లోని మొదటి రోజు మరో అర గంటలో పూర్తి కావస్తోంది. డాగ్‌మర్ క్లాసు ముందుగా వదలివేయడంవల్ల నా కోసం వెతుక్కుంటూ, అది నా క్లాస్ వద్దకు వచ్చింది.

"క్రాటిన్, నన్ను ఇంటికి తీసుకు వెళ్ళవ్?" అని డాగ్‌మర్ బయటనుంచి అరు స్తోంది.

కాస్సేపు ఉండమన్నట్లు నేను నా కళ్ళతో సౌంజ్ఞ చేశాను. మిస్ స్కాన్‌లన్ బయట నిలబడ్డ డాగ్‌మర్‌ని చూసి, "పాపాయి, ఇలా రా!" అని పిలిచింది.

డాగ్‌మర్ జంకుతూ, మాస్టరు దగ్గరగా వెళ్ళింది.

"నీ పేరు?..." అంది స్కాన్‌లన్.

"డాగ్‌మర్. నేను ఇంటికి వెళ్ళాలి," అందది.

"నిన్ను ఇంటికి వెళ్లనివ్వను. నిన్ను ఇక్కడే ఉంచుకొంటాం!"

దాగ్‌మర్ భయంతో ఓసారి వెనుక బల్లమీద కూర్చున్న నా వేపు చూసింది.

"కాట్రిన్! కాట్రిన్!" అని కంగారుగా అరిచింది.

దాని గాభరా గమనించి, నేను చటుక్కున దానివద్దకు పరుగెత్తాను. "దాన్ని ఏమీ అనకండి. భయపడుతోంది. ఈ స్కూల్‌కి రావడం ఇదే మొదటి రోజు," అన్నాను.

"మరేం ఫరవాలేదు. నువ్వు ఊరుకో. అమ్మాయి, ఇలా చూడు. మీ అక్కయ్య పేరు ఏమిటి?" స్కాన్‌లన్ అడిగింది.

"కాట్రిన్!" అంది దాగ్‌మర్ వొణుకుతూ.

"కాట్రిన్ కాదు; సరిగ్గా పలకడం నేర్చుకో. కేథరీన్ అను."

ఆమె ఎంత చెప్పినా దాగ్‌మర్ నా పేరును సరిగ్గా పలకలేకపోయింది. మిస్ స్కాన్‌లన్ దానివైపు విసుగ్గా చూస్తూ, "ఈసారి నీ అక్క పేరు సరిగ్గా చెప్పు," అని మళ్ళా కేకేసింది.

నేను దానివైపే చూస్తున్నాను. డాగ్మర్ భయం పదిరెట్లు హెచ్చింది. అదే క్షణంలో దాని బట్టలన్నీ ప్రకృతి అవసరానికి లొంగిపోయి, చటుక్కున తడిశాయి. జరిగిన ఆపదని గమనించగానే మిస్ స్కాన్లన్ దాన్ని తీసుకొని వెంటనే బయటకు వెళ్లిపొమ్మని నాతో చెప్పింది. డాగ్మర్ చెయ్యి పట్టుకొని, మెల్లగా గదిలోంచి గుమ్మంవైపు నడిచాను.

"కేథరీన్, ఎవరినైనా త్వరగా వచ్చి, నా డెస్కు ముందు శుభ్రం చెయ్యమని చెప్పు," అంది మిస్ స్కాన్లన్ నా వెనుక నుంచి.

గదిలో ఉన్న ఆడపిల్లలందరూ పరిహాసంగా నవ్వారు.

"చిన్న పిల్ల, మీరు అనవసరంగా దాన్ని భయపెట్టారు. ఏం చేస్తున్నదీ తనకేం తెలుసు?" అన్నాను ఆమె వైపు చూస్తూ.

"అయిందేదో అయిందిలే. త్వరగా నౌకర్ని గుడ్డ పట్టుకొని, ఇక్కడికి రమ్మను."

మరేం మాట్లాడకుండా నేనూ, డాగ్మర్ స్కూల్లోంచి బయటకు వెళ్లాం. క్రిస్టినీ

కూడా స్కూల్ దాటేలోగా మమ్మల్ని కలుసుకొన్నది. ముగ్గురం మౌనంగా ఇంటికి నడిచాం.

## 7

ప్రథమంగా మా ఇంట్లోని ఒక గదిని మిస్ డురాంట్ అనే ఆమె అద్దెకు తీసుకొంది. ఆమె ఏదో కంపెనీలో టెలిఫోన్ ఆపరేటర్‌గా పనిచేస్తోంది. పగలల్లా ఇంట్లో పడుకొని, రాత్రిళ్ళు ఆఫీసు పనిలోకి వెళ్ళేది. అందువల్ల ఆమెను మేం తరుచు చూడలేక పోయేవాళ్ళం.

మిస్ డురాంట్ సాధారణంగా తన గదిలోనే ఉంటూండేది. సన్నగా, బక్కపల్చగా ఉండేది. ఉడికించిన కూరగాయలంటే ఆమెకి ఇష్టం ఉండేది కాదు. ఆమె తిండి చాలా తక్కువగా తినేది. ఎప్పుడో అప్పుడు ఏ గాలికో ఆమె ఎగిరిపోతుందని నాన్న పరిహాసంగా అంటూండేవాడు.

కాని, మిస్ డురాంట్ పత్రికలూ, పుస్తకాలూ బాగా చదివేది. ఒక రోజు పాత పత్రికలన్నీ నాకిచ్చి, వాటిని ఎక్కడైనా పారేయమంది. ఆ పత్రికలన్నిటినీ నా చిన్న

గదిలోకి పట్టుకెళ్ళి, వాటిని భద్రంగా దాచుకొన్నాను.

నా చిన్న గదిలో ఇంతకు ముందు పనికిరాని సామాన్లన్నీ ఉండేవి. ఆ గదిని ఎంతో శుభ్రంగా చేసుకొని, దాన్ని నేను మెల్లిగా ఆక్రమించుకొన్నాను. మిస్ డురాంట్ ఇచ్చిన పత్రికల్ని చదవసాగాను. ఒకరోజు ఒక పత్రిక తిప్పుతూ ఉంటే, నాకొక విచిత్రమైన ప్రకటన కనపడింది.

"వారం రోజుల్లో మీరు కూడా ఒక ప్రఖ్యాత రచయిత అవండి! ఈ నాడు సినిమాలకీ, రేడియోకీ అనేక మంది రచయితలు కావాలి. మంచి రచయిత అవగల్గితే, వేలకి వేలు గడించవచ్చు. వెంటనే 7 డాలర్లు మాకు పంపించి, రచయిత ఎలా అవ్వాలో మేము పంపే పుస్తకాల ద్వారా తెలుసుకోండి."

ఆ ప్రకటన నన్నెంతో ఆకర్షించింది. అది చదవగానే రచయిత అనడానికి ఏదో సులువైన మార్గం ఉందని నాకు అర్థమయింది.

ఏడు డాలర్లు నా దగ్గర ఉంటే, నేను కూడా ఓ పేరుపొందిన రచయిత్రిని అయి పోతానన్నమాట. అటుపైన కావలసినంత డబ్బు నేనే గడిస్తాను. ఆ డబ్బుతో ఏం కావలిస్తే, అవన్నీ కొనుక్కోవచ్చు. నేను రచయిత్రిగా డబ్బు గడించడం ప్రారంభించాక, ఈ ఇంట్లోని వాళ్ళెవరూ పని చెయ్య వలసిన అవసరం ఉండదు. నా చిన్న గదిలో కూర్చుని, నేను ఏదో పెద్ద రచయిత్రిని అయి పోయినట్టు భావించుకొంటూ, ఎన్నో కలలు కన్నాను.

కాని, ఏడు డాలర్లు నా దగ్గర లేవుగా! మళ్ళా ఆ ప్రకటన చదివాను. ఇంతకు ముందు నేను చూడని ఒక విషయాన్ని గుర్తించాను.

"మీకు మా పుస్తకాల మీద నమ్మకం లేకపోతే, డబ్బు పంపకండి. కాని, మా పుస్తకాలకోసం రాయండి. ఐదు రోజులపాటు వాటిని చదివి, మీ అంతట మీరే పరీక్షించుకోండి. అవి ఉపయోగించాయని మీకు దృఢ నమ్మకం కలిగితే, ఐదు రోజుల తరు

వాత మీరు మాకు వెంటనే ఏడు డాలర్లూ పంపాలి. లేకపోతే, ఐదు రోజుల లోగా మా పుస్తకాల్ని మాకు వాపసు చేయాలి."

అది చదువుతూ ఉంటే, నేను తింటున్న రొట్టె నేతిలో పడ్డట్టయింది. ఆ పేజీ కింద ఉన్న కూపన్ మీద నా పేరూ, అడ్రసూ రాసి, సంతకం పెట్టాను. వెంటనే వాళ్ళ పుస్తకాలు నాకు పంపమన్నాను. ఆ కూపన్ని ఒక అందమైన కవర్లో పెట్టి, పోస్టు చేశాను.

పుస్తకాలు ఇంకా రాలేదు. కాని, నాలో ఎంతో ఉత్సాహంగా ఉండేది. అందరికంటే ముందు తెల్లారగట్టే లేచేదాన్ని. కాస్త వెలుతురు వచ్చేసరికి పోస్టువాడు ఎప్పుడు వస్తాడా అని కాచుకు కూర్చునేదాన్ని. పోస్టుమన్ రాగానే "నాకేదైనా పాకెట్ వచ్చిందా?" అని ఆత్రుతగా అడిగేదాన్ని. రాలేదని అతను అనేవాడు. ఆ పాకెట్ వస్తే, అది నాకు భద్రంగా పట్టుకొచ్చి ఇయ్యమని పదే పదే చెప్పేదాన్ని.

15 రోజులు దాటిన తర్వాత న్యూయార్క్ నించి ఆ పాకెట్ నా అడ్రసుకి వచ్చింది.

అప్పుడు పెద్దలెవరూ ఇంట్లో లేరు. ఆ పాకెట్‌ని తీసుకొని, మెల్లగా నా చిన్న గదిలోకి పరుగెత్తాను. ఆ పాకెట్ విప్పుతూంటే ప్రఖ్యాత రచయితల ప్రపంచంలోకి నాకోసం తలుపులు తెరవబడుతున్నట్లు భావించుకొన్నాను. చిన్న చిన్న అక్షరాల్లో ముద్రించబడిన ఏడు పుస్తకాల్ని బయటకు లాగాను. తొందరగా వాటిని చదవడం ప్రారంభించాను. కొన్ని పదాలు నాకు అర్థం కాలేదు. నేను డిక్షనరీ దగ్గర పెట్టుకోవలసి వచ్చింది. అలా కాస్సేపు చదివేసరికి నాకు విసుగు పుట్టింది. ఆ పుస్తకాలన్నిటినీ గదిలో ఓమూల పడేసి, గాలిలోకి నడిచాను. అటుపైన ఇరవై రోజులదాకా ఆ పుస్తకాలనుగూర్చి నేను పూర్తిగా మర్చిపోయాను. కాని, ఒక రోజు న్యూయార్క్‌నుంచి ఒక పొడుగాటి ఉత్తరం నా పేర వచ్చింది. ఆ ఉత్తరాన్ని చదువుతూంటే, నా గుండె దడదడ కొట్టుకొంది. అందులో ఇలా రాయబడి ఉంది:

"మీరు కోరిన ప్రకారం మా పుస్తకాలన్నీ మీకు పంపాం. అవి మేము పంపి, అప్పుడే 20 రోజులయింది.

అందువల్ల మా పుస్తకాలు మీకు చాలా ఉపయోగించాయని మేం నమ్ముతున్నాం. మీ దగ్గరనుంచి ఇంకా ఏడు డాలర్లూ మాకు అందలేదు. అది వెంటనే దయచేసి పంపండి."

ఆ ఉత్తరం చదవగానే ఏం చెయ్యాలో నాకు తోచలేదు. 7 డాలర్లు ఎలా సంపాదించడం? నాన్న చూస్తే వడ్రంగి పని చేస్తున్నాడు. అమ్మ ఇంట్లోని గదుల్ని అద్దెకిస్తోంది. వచ్చే డబ్బు మాకు సరిగ్గా సరిపోతోంది. అటువంటి సందర్భంలో 7 డాలర్లు వాళ్ళకి ఎలా పంపడం?

రోజులు గడుస్తున్నాయి. ఎంతో ఆలోచిస్తున్నాను. కాని, ఆ డబ్బు వాళ్ళకి పంపించగలననే నమ్మకం నాకు లేదు. కాని, ఎంతకీ వాళ్ళకి డబ్బు పంపించకపోతే, ఆ కంపెనీ మాత్రం ఊరుకొంటుందా? నామీద కేసు పెట్టి, ఆ కంపెనీ నన్ను జైలుకి పంపిస్తుందేమోనని భయపడ్డాను. అడంతా ఆలోచిస్తుంటే, అమ్మ నా గదిలోకి వచ్చింది.

"అమ్మా, ఈ పుస్తకాలన్నీ న్యూయార్క్ నించి తెప్పించాను. రచయిత్రి అవ్వాలని

నాకెంతో ఆశగా ఉంది," అన్నాను అమ్మతో.

"కాట్రిన్, నీకు కథలూ, అవీ రాయడం అంటే నిజంగా ఇష్టమా?"

"ఈ పుస్తకాలన్నీ చదివితే, ఎప్పుడో అప్పుడు నేనొక పెద్ద రచయిత్రినవుతా నమ్మా" అని, కాస్సేపాగి, ఆ కంపెనీకి ఇవ్వ వలసిన డబ్బు గురించి అమ్మతో చెప్పాను.

"ఆ డబ్బు వాళ్ళకి పంపుదాం," అంది అమ్మ ముక్తసరిగా.

ఒక్కసారి అమ్మని కౌగలించుకొని, బుగ్గలమీద ముద్దు పెట్టుకొన్నాను. మరునాడే అమ్మ రహస్యంగా న్యూయార్క్‌లో ఉన్న ఆ కంపెనీకి 7 డాలర్లు నా పేర్న పంపించింది.

విన్‌ఫోర్డ్ స్కూల్‌లో దుమారం రేగింది.

మా స్కూలుకి బాగా పేరుపొందిన వారెవరో రాబోతున్నారని మేం విన్నాం. ఒక రోజు మా ప్రిన్సిపాల్ మిస్ ఫైర్‌న్స మా అందరికీ ఇలా చెప్పింది: "ఉన్నత మహిళ అయిన మిసెస్ రీడ్ విన్‌ఫోర్డ్ మన స్కూలుకి వస్తున్నారు. ఆవిడ వస్తున్నందుకు

మనం అందరం గర్వించాలి. ఆమె భర్త పేరనే మన స్కూలు స్థాపించబడింది. మీరంతా తగు విధంగా మాకు తోడ్పడి, ఆమెకి అఖండమైన స్వాగతం ఇవ్వాలి."

అటుపైన కొన్ని రోజులపాటు ఆమె రాకకోసం ఏర్పాట్లు చెయ్యడంలో మాస్టర్లూ, విద్యార్థులూ కూడా కలిసి పనిచేసే వాళ్ళం. హెస్టర్ అనే విద్యార్థినిని రిసెప్షన్ సంఘానికి చైర్మన్‌గా నియమించారు. హెస్టర్ బాగా ఉపన్యాసాలిస్తుంది. ఒకరోజు మా అందరితోటీ హెస్టర్ ఇలా చెప్పింది: "ఈ సందర్భంలో మనం అందరం కలిసి పని చెయ్యాలి. ఒక చిన్న ఆలోచన నాకు తట్టుతోంది. విద్యార్థినులందరం ఎవరికి తోచింది వాళ్ళు తమ ఇళ్లలో తయారు చేసి పట్టుకొస్తే, ఎంతో బాగుంటుంది. అవన్నీ మనం అతిథిగా రాబోతున్న రీడ్ విన్‌ఫోర్డ్‌కు ఇవ్వవచ్చు."

మేమందరం చప్పట్లు కొట్టాం.

"మా అమ్మ కేక్స్ చాలా బాగా చేస్తుంది. నేను కేక్స్ పట్టుకొస్తా," అంది మేడిలీన్.

"బాగుంది," అంది హెస్టర్.

"మా అమ్మ బూడిద గుమ్మడి సాండ్ విచెస్ చేస్తుంది; అవి నేను పట్టుకొస్తాను," అంది థైరా మారిన్.

"మా అమ్మని ఏదో ఒకటి చెయ్యమని నేను పట్టుకొస్తాను," అంది కార్మెలీటా.

"నాకు ఏమైందేదో నేనూ పట్టుకొస్తాను," అన్నాను నేను.

ఇల్లు చేరుకునే సరికి అమ్మా, జెన్నీ పిన్నీ వంటింట్లో ఉన్నారు. లీజ్ విన్‌ఫోర్డ్ అనే పేరు పొందిన స్త్రీ మా స్కూలుకి రాబోతోందని వాళ్ళతో చెప్పాను.

"అమ్మా, ఆమె రాక సందర్భంలో నువ్వేదో ప్రత్యేకంగా వండాలి. అది నేను స్కూలుకి పట్టుకెడతాను," అన్నాను.

"నా వంట క్షణక్షణానికీ మారదు. ఎప్పుడూ ఒకలాగే ఉంటుంది," అంది అమ్మ.

చివరికి జెన్నీ పిన్ని ఏది వండవలసిందీ నిర్ణయించింది.

నేను స్కూలుకు వెళ్ళగానే అనేకమంది మా ఇంటినుంచి నేనేం పట్టుకొస్తున్నానని పదే పదే అడిగేవారు.

"కాస్త ఆగండి. త్వరలో మీరే చూస్తారుగా!" అని ఊరుకునేదాన్ని.

చివరికి రీడ్ విన్‌ఫోర్డ్ వచ్చే రోజు ఉదయించింది. అమ్మ వండిన పదార్థాలను జాగ్రత్తగా తీసుకొని, నేను స్కూలుకి వెళ్లాను. ఇల్లు దాటేసరికి వర్షం వచ్చింది. అమ్మ వండిన పదార్థాలు తడిసిపోకుండా గౌను కింద దాచి, వేగంగా స్కూలుకి పరుగెత్తాను. ఒక పెద్ద హాల్లో ఒక పొడుగాటి టేబుల్ మీద విద్యార్థినులు ఇంట్లో చేయించి పట్టుకొచ్చిన పదార్థాలన్నీ పెట్టబడి ఉన్నాయి.

మిస్ స్టాన్‌లన్ ఓసారి నావైపు చూసి, కోపంతో ఇలా అంది: "నీ బట్టలూ, జోళ్ళూ పూర్తిగా తడిసిపోయాయి. వాటిని కొంచెం వేడి చెయ్యి."

నేను మాట్లాడకుండా ఆ గదిలోకి వెళ్లాను. మా స్కూల్‌లో పని చేస్తున్న పని మనిషి అక్కడ నాకు అవుపడింది.

"ఈవేళ పెద్ద స్వాగతం జరగబోతోంది. రీడ్ విన్‌ఫోర్డ్ వస్తోందని నీకు తెలుసుగా!" అన్నాను ఆమెతో.

"స్వాగతం!" అని ఆ పని మనిషి పెదాలు విరిచింది. అర్థం కాలేదు.

"ఈ స్కూల్‌లో అందరికంటే నేనెంతో కష్టపడి పని చేస్తున్నాను. అయినప్పటికీ ఈ స్వాగతంలో పాల్గొనమని నన్నెవరూ పిలవ లేదు," అంది పని మనిషి కోపంతో.

"అలాగా!" అని ఊరుకొన్నాను.

"నేను లేకుండా రీడ్ విన్‌ఫోర్డ్‌కి స్వాగతం ఎలా ఇస్తారో చూస్తానుగా!" అందామె.

ఆ రోజు మధ్యాహ్నం ఇంకా స్కూలు జరుగుతోంది. వర్షం రావడంవల్ల గదులన్నీ చాలా చల్లగా ఉన్నాయి. ఇద్దరు ముగ్గురు విద్యార్థినులు వణకడం ప్రారంభించారు. పాఠాలు చెప్పే మా క్లాస్ రూమ్‌లో సాధా రణంగా వేడిగా ఉండేది. మిస్ స్కాన్‌లన్ ఆజ్ఞ ప్రకారం రెండు మూడుసార్లు మేము వెళ్లి, మా క్లాస్ రూమ్‌లో వేడిని హెచ్చు చెయ్యమని పని మనిషితో చెప్పివచ్చాం. కాని, లాభం లేకపోయింది.

స్కూలు అయిపోయాక అందరం హాల్లో సమావేశమయ్యాం. కార్మిపీటా నా పక్కనే

నిలబడింది. కాగితంలో చుట్టిన పొడుగాటి ఓ పాకెట్టు ఆమె చేతిలో ఉంది.

"మీ ఇంట్లోంచి నువ్వు ఏం పట్టుకొచ్చావ్?" అని ఆమెని అడిగాను.

"ఇదిగో - ద్రాక్ష సారాయి సీసా పట్టుకొచ్చాను," అంది కార్మెనీటా, పాకెట్‌ని నాకు చూపిస్తూ.

నేను ఆశ్చర్యపోయాను. అటువంటి బహుమతి స్కూలు పిల్లలు పట్టుకు రావడం సభ్యంగా ఉంటుందో, లేదో నాకు బోధపడ లేదు.

"నువ్వు అటువంటి బహుమతి పట్టుకొచ్చావని తెలిస్తే, మన ప్రిన్సిపాల్ ఏమంటుందో!" అన్నాను.

"మరేం ఫరవా లేదు. ద్రాక్ష సారాయి శరీరానికి చాలా మంచిది," అంది కార్మెనీటా.

అందరి కళ్ళూ గుమ్మం వైపు తిరిగాయి. ప్రిన్సిపాల్, మిసెస్ రీడ్ విన్‌ఫోర్డ్‌ని వెంటబెట్టుకొని, హాల్లోకి వచ్చింది. ఒక ఎత్తయిన కుర్చీలో రీడ్ విన్‌ఫోర్డ్ కూర్చుంది. ఆమె ముందు మేమందరం కూడా కూర్చున్నాం.

మిసెస్ విన్‌ఫోర్డ్ చాలా అందంగా ఉంది. మమ్మల్ని కలుసుకున్నందుకు తనెంతో సంతోషిస్తున్నానని ఆమె చెప్పింది. ఆమె ఇంకా ఎంతో చెప్పకుపోయింది. కాని, ఆమె మాటలు నాకు వినపడలేదు. మేము కూర్చున్న హాల్లో చెప్పలేనంత చలిగా ఉంది. వణుక్కూ, వాతం వచ్చేటట్టు ఉంది. మిస్ స్టాన్‌లన్ తన కుర్చీలోంచి లేచి, త్వరగా వెళ్లి, ప్రిన్సిపాల్ చెవిలో ఏదో చెప్పింది. ప్రిన్సిపాల్ వెంటనే హాల్లోనుంచి బయటకు పరుగెత్తింది.

ఈలోగా మిసెస్ రీడ్ విన్‌ఫోర్డ్ తన ఉపన్యాసాన్ని ముగించింది. అదే సమయంలో ప్రిన్సిపాల్ తిరిగి హాల్లోకి వచ్చింది. ఆమె మొహం కోపంతో ఎర్రబడింది. ఓసారి మా అందరివైపూ చూసి, ప్రిన్సిపాల్ ఇలా అంది : "దురదృష్టవశాత్తూ మా స్కూల్లో ఉండే పనిమనిషి ఎవరితోటీ చెప్పకుండా ఎక్కడికో వెళ్లిపోయింది. ఈ హాలుని వేడి చేసే ఎలక్ట్రిక్ స్విచ్ కూడా వెయ్యడం మర్చిపోయింది. అదే కాకుండా మన 'టీ' చేసుకొనే గదికి తాళం వేసి, ఆ తాళం

చెవిని కూడా పట్టుకొని పోయింది. ఇంత చలిగా ఉన్న సమయంలో మన అందరికీ 'టీ' తాగాలని ఉంది. మీరందరూ కాస్సేపు ఓర్చుకుంటే, అన్నీ సవ్యంగా జరిగేటట్టు నేను చూస్తాను."

హాల్లో చలి ఎక్కువ అవుతోంది. రీడ్ విన్‌ఫోర్డ్ తన వులెన్ కోటు కాలర్‌ని పూర్తిగా ముడుచుకొంది. మిస్ స్కాన్‌లన్ మూడు, నాలుగు సార్లు తుమ్మింది. ప్రిన్సిపాల్ తన కుర్చీలో కూర్చుని, వణుకుతున్న రీడ్ విన్‌ఫోర్డ్‌తో ఏవేవో చెప్తోంది. మర్యాదగా ఆమె వింటోంది. మరికొన్ని నిమిషాల్లో స్కూల్లో పనిచేసే టీచర్లందరూ ఏవేవో నెపాలమీద హాల్లోంచి మెల్లిగా బయటకు జారారు. చివరికి రీడ్ విన్‌ఫోర్డ్ ప్రిన్సిపాల్ కొంతమంది విద్యార్థినులూ మాత్రమే హాల్లో మిగిలారు. టీ గది తాళం చెవులు పట్టుకు రావడానికి వెళ్లిన లయన్స్ ఇంకా తిరిగి రాలేదు. ఆమె వస్తుందన్న ఆశతోనే మేము వేచివున్నాము. తలుపు దగ్గర చప్పుడయింది. ఆశతో అందరం అటువైపు చూశాం. చెల్లెలు క్రిస్టీనీని మెల్లిగా ఇంటికి పంపి

వేశాను. ఆమె వెళ్ళి, ఇక్కడ జరిగినదంతా అమ్మకు చెప్పింది. వెంటనే అమ్మ స్కూల్ కు బయలుదేరింది. మెల్లిగా మా అమ్మ లోపలికి వచ్చింది! నావైపు చూసి నవ్వుతూ, అమ్మ రీడ్ విన్ ఫోర్డ్ ముందుకు వెళ్ళింది. "ఈ హాల్లో చాలా చల్లగా ఉంది. ఇంకొంత కాలం ఇలా మీరు కూర్చుంటే, మీ ఆరోగ్యం పాడవుతుంది. మీకు వేడి కాఫీ కావాలి," అంది అమ్మ.

"వేడి కాఫీ ఉంటే మంచిదే!" అంది మిసెస్ విన్ ఫోర్డ్.

సమీపంలో ఉన్న టేబిల్ వద్దకు వెళ్ళి, తను కూడా పట్టుకొచ్చిన పేకెట్ని అమ్మ దానిమీద పెట్టింది. కాస్సేపట్లో కాఫీ కలిపి, రీడ్ విన్ ఫోర్డ్ కీ, ప్రిన్సిపాల్ కీ ఇచ్చింది. మా పిల్లలందరికీ చాక్లెట్లు పంచిపెట్టింది. ఆ క్లిష్ట సమయంలో కాఫీ పట్టుకొచ్చి ఇచ్చినందుకు ప్రిన్సిపాల్ గ్రైన్స్, మిసెస్ రీడ్ విన్ ఫోర్డ్—వాళ్ళిద్దరూ అమ్మని ఎంతో మెచ్చుకొన్నారు. చాలా సేపటివరకూ అమ్మని దగ్గరగా కూర్చోబెట్టుకొని, మాట్లాడుతూ ఉండిపోయారు.

## 9

నాన్న ఆరోగ్యం బాగో లేదు. సుస్తీగా ఉన్నదని నాన్నెప్పుడూ మాతో చెప్పే వాడు కాదు. కాని, తన కుర్చీలో బరువుగా జడ్డకంగా కూర్చోడం, అనేకసార్లు చేత్తో నుదుటిని గట్టిగా పట్టుకోవడం – ఈ సూచనలని బట్టి నాన్న అనారోగ్యంగా ఉన్నాడని మేము తెలుసుకొన్నాం. ఎక్కువగా ఆయన వైపు చూస్తూంటే, మా చూపును మరల్చ డానికి నాన్న ఏదో రహస్య ధోరణిలో చెప్పుకుపోయేవాడు. ఎన్ని రోజుల నుంచో మా ఇంట్లో అద్దెకుంటున్న మిస్ డ్యురాంట్ గదిలో బీరువాలు చేయించిపెట్టాలని అనుకొంటున్నాము. ఆ బీరువాలని నాన్న మునుపు చేసినంత వేగంగా చెయ్యలేక పోయాడు. చివరికి నాన్న స్థితి చూస్తుంటే అమ్మకి భయం వేసింది. ఎన్నిసార్లో ఎలా ఉందని అమ్మ ఆయన్ని అడిగేది.

"ఏమీ లేదులే, అదే పోతుంది," అని ఆయన ఊరుకొనేవారు.

అమ్మ మెల్లగా నాన్న దగ్గరకు వెళ్లేది. ఆయన నుదురుని తన చేతుల్తో నిమిరేది. నాన్న ఆనందంగా కళ్ళు మూసుకొనేవాడు.

"అది చాలా బాగుంది; నీ చేతులలా ఉంటే నా తలనొప్పి తగ్గుతోంది," అనేవాడు నాన్న.

కాని, రోజులు గడిచిన కొద్దీ అమ్మ తన చేతుల్ని నాన్న నుదురుమీద ఎంత గట్టిగా నొక్కి పెట్టినా, ఆయన తలనొప్పి తగ్గేది కాదు. చన్నీళ్ళలో చేతులను ముంచి, ఆ తడిచేతుల్ని నాన్న నుదుటిమీద అమ్మ పెడుతూ ఉండేది. ఏం చేసినా అనుభవించలేని బాధ మాత్రం నాన్న కళ్ళల్లోంచి తొంగి చూస్తూ ఉండేది.

ఆ రోజు మధ్యాహ్నం పని మానేసి, నాన్న ఇంటికి త్వరగా వచ్చేశాడు. మేమందరం వంటింట్లో ఉన్నాం. గదిలోకి చటుక్కున వచ్చిన నాన్నని చూసి, అందరం ఆశ్చర్యపోయాం. ఏ స్త్రీయైనా ఉంటేగాని సాధారణంగా నాన్నలాంటి కార్మికులు అంత త్వరగా ఇంటికి తిరిగిరారు.

అందరం నాన్న వైపు చూశాం. తన కళ్ళు తిరుగుతున్నాయని ఆయన అన్నారు. అమ్మ వేడిగా కాఫీ తయారుచేసి ఆయనకు ఇచ్చింది. రెండు గుక్కలు తాగి, చివరకు తాగలేక ఆయన కాఫీని వదిలేశారు. దాని మూలంగా నాన్న ఆరోగ్యం చెడి ఉంటుం దని అమ్మ వెంటనే గుర్తించింది. వెంటనే డాక్టరు జాన్సన్‌ని తీసుకురావడం కోసం నెల్సని పంపించింది. నేనూ, క్రిస్టినీ మంచం మీద పక్క వెయ్యడం కోసం పరుగెత్తాం.

పక్క అంతా తయారుగా ఉంచి, మే మిద్దరం మళ్ళా వంటింట్లోకి తిరిగొచ్చాం. అమ్మ ఇంకా అక్కడే ఉంది. చటుక్కున విచిత్రమైన ధ్వని చేస్తూ, కుర్చీలోంచి నాన్న నేలమీదకి జారిపడ్డారు. ఆయన శరీరం మెలి కలు తిరిగినట్లయింది. చాలా గట్టిగా ఊపిరి పీలుస్తున్నట్లు మా అందరి గుండెలు దడదడ కొట్టుకున్నాయి.

ఆ దృశ్యాన్ని చూసి దాగ్‌మర్, నేనూ ఏడవడం ప్రారంభించాం. అమ్మ మా ఏడు పును గమనించ లేదు. మోకాళ్ళమీద

కూర్చొని, నేలమీదకి వొంగింది. నాన్న తలని మెల్లగా పైకెత్తి, తన వొళ్లో పెట్టుకొంది. ఆయన నోటమ్మట చొంగలాంటిదేదో బయటకు వస్తోంది. తన జేబు రుమాలుతో ఆ చొంగని తుడిచి పారేసింది.

ఇంతలో డాక్టర్ జాన్సన్‌ని వెంటబెట్టుకొని నెల్సన్ వచ్చాడు. అమ్మ కదలకుండా అలాగే కూర్చుంది. జాన్సన్ నాన్నని పరీక్ష చేశాడు.

ఏవేవో ప్రశ్నలు అడగసాగాడు: ఇంతకు ముందు ఎప్పుడేనా నాన్నకి తలమీద గాయం తగిలిందా? ఎత్తయిన స్థలంనుంచి ఆయనెప్పుడైనా క్రిందపడ్డారా?

'లే' దన్నట్టు అమ్మ తల ఆడించింది. కాని, రెండేళ్ళ క్రితం ఆయనకి తలమీద ఒక గాయం తగిలిందని అమ్మ చెప్పింది.

డాక్టర్ జాన్సన్ లేచి నిలబడ్డాడు. "అయితే, దాని మూలంగానే మెదడుకి ఏదో గాయం తగిలి ఉంటుంది. ఎక్స్‌రే (x'ray) తీస్తేగాని, ఆ గాయం ఎటువంటిదో చెప్పడం సాధ్యం కాదు. ఈయన్ని వెంటనే

ఆస్పిటల్‌లో చేర్చడం అత్యవసరం. కావలిస్తే, అంబులెన్సు కారుని పంపిస్తాను."

అమ్మ ఒకసారి సూటిగా జాన్సన్ వైపు చూసింది. ఆమె కుడిచేయి ఇంకా నాన్న బుగ్గపైనే ఉంది.

"ఏ ఆస్పిటల్‌లోనైనా ఆయన్ని చేర్చడానికి నాకు అభ్యంతరం లేదు. కాని, నా కోరిక ఒక్కటే. నేను అనుక్షణం ఆయనతో ఉండాలి," అంది అమ్మ.

అమ్మ చెప్పిన మాటలు వింటూంటే, ఇంతకు ముందు దాగ్‌మర్ ఆస్పిటల్‌లో చేరడం నాకు బాగా జ్ఞప్తికి వచ్చింది. క్లినిక్ ఆస్పిటల్‌లో చేర్చిన దాగ్‌మర్‌ని చూడడానికి అమ్మ అష్టకష్టాలూ పడాల్సి వచ్చింది.

"సెయింట్ జోసెఫ్స్ ఆస్పిటల్‌లో చేర్చండి. ఆ ఆస్పిటల్‌లో ఖర్చు తక్కువగా అవుతుంది. అక్కడున్న నర్సులు మంచి వాళ్ళు," అన్నాడు జాన్సన్.

"నా క్కావలసింది వాళ్ళ మంచీ, చెడ్డా కాదు. నన్ను మా వారితో ఉండనిస్తారా?"

డాక్టర్ జాన్సన్ చిరునవ్వుతో ఆమె ఉండొచ్చని జవాబిచ్చాడు. అటుపైన జాన్సన్ సెలవు తీసుకొని వెళ్లిపోయాడు.

మా పెట్టెలోని డబ్బంతనీ బయటకు తీసి, దాన్ని జాగ్రత్తగా అమ్మ మనీపర్సులో పెట్టాం. అంత ఎక్కువగా డబ్బు లేదు. మేము ఇంటిలో కూర్చొని చెయ్యవలసిన పనులన్నీ అమ్మ మాతో జాగ్రత్తగా చెప్పి, కాయి తాలమీద వ్రాయించింది. ఆ పరిస్థితుల్లో కూడా అమ్మ మొహంలో ఎటువంటి కంగారూ కనుపడ లేదు. చివరికి ఆంబులెన్సు కారు వచ్చి, మా ఇంటి ముందు ఆగింది. అమ్మ తొందరగా లేచి, కోటు తొడుక్కొని, టోపీ పెట్టుకొంది. నాన్నని స్ట్రెచ్చర్ మీద పడుకోబెట్టి, మెల్లగా బయట నిల్చున్న ఆంబులెన్సు లోకి మోసుకెళ్ళారు. అమ్మ ఒక్కొక్కళ్ళనీ ముద్దుపెట్టుకొని, తను కూడా ఆంబులెన్సులో ఎక్కింది.

అమ్మ వెళ్లిపోయిన కొంతసేపటివరకూ మేమందరం వంటింటిలోనే కూర్చుండిపోయాం. మేం కాగితాలమీద రాసుకొన్నదంతా జాగ్రత్తగా ఓసారి చదువు

కున్నాం. అది చదువుతూంటే చెయ్యవలసిన ఎన్ని పనులో అగుపడ్డాయి. వెంటనే మధ్యాహ్నం భోజనం తయారు చెయ్యాలి. కాని, అది చెయ్యడానికి ఎక్కడ ప్రారంభించాలో నాకేమీ బోధపడింది కాదు.

నెల్స లేచి, సమీపంలోనున్న కిరాణా షాపుకు వెళ్ళి, కొన్ని వస్తువులు కొని పట్టుకొస్తానని వెళ్ళాడు. అదే క్షణంలో దాగ్మర్ ఏడ్వసాగింది.

"దాన్ని కూడా తీసుకువెళతాను," అన్నాడు నెల్స. నెల్సకి ఏం జవాబు చెప్పాలో తెలియక క్రిస్టినీ, నేనూ ఒకళ్ళనొకళ్ళు చూసుకొన్నాం. ఈ క్లిష్ట సమయంలో అందరూ ఒకే చోట ఉండడం మంచిదనిపించింది. ఇద్దరం లోపలికి పరుగెత్తాం. పసిపాప కారెన్‌కి శాలువ కప్పి, నేనూ, క్రిస్టినీ, నెల్స వెనుకనే కిరాణాషాపుకి వెళ్ళాం. అక్కడనుంచి తిరిగివచ్చాం. అందరం మళ్ళా ఒకే గదిలో కూర్చున్నాం.

అంతవరకూ చీకటిగా ఉన్న మా హృదయాలు ఒక్కసారి 'నియాన్ సైన్'లా ప్రకా

శించాయి. ఎక్కడికో వెడుతున్న జెన్నీ పిన్ని మా ఇంటి ముందు దిగి, లోపలికి పరుగెడుతూ వచ్చింది. జరిగిందంతా ఆమెతో చెప్పాం. ఆమె రావటంతోటే మా బాధలన్నీ అడుగంటాయి. మేము కాగితాలమీద రాసుకొన్న పనులన్నీ జెన్నీ పిన్ని ఏదో యంత్రంలా చేసుకుపోయింది. గంటలో భోజనం తయారయింది. అద్దెకుంటున్న మిస్ డురాండ్‌కు జెన్నీ పిన్ని భోజనం పంపించింది. మా ఆఖరిచెల్లెలు కారెన్‌కి పాలుపోసి, దాన్ని నిద్ర పుచ్చింది. తన పనులన్నీ ముగించుకొని, ఎవరికో టెలిఫోన్ చేస్తానని మాతో చెప్పి, సమీపంలో ఉన్న మందులషాపుకి వెళ్లింది.

కొంతసేపు అయ్యేసరికి తతిమ్మా పిన్నిలందరూ కాకుల్లా వచ్చి, మా ఇంటిలో పడ్డారు. ట్రీనా పిన్నీ, ఆమె భర్త తిర్ కెల్సన్‌తో సహా వచ్చింది. నాన్నని గురించి ఏదేనా వినగానే ట్రీనా పిన్ని కొంచెం ఏడుపుమొహం పెడుతూ ఉండేది. మార్తా పిన్ని తన భర్త ఓల్‌తో సహా వచ్చింది. ఒక సంచీ నిండా ఆపిల్స్ పెట్టి పట్టుకొచ్చింది. పళ్ళు పట్టు

కొచ్చినందుకు వాళ్ళకి ధన్యవాదా లర్పించి, భోజనాల టేబిల్ మధ్యనున్న పాత్రలో ఆపిల్స్ అన్నిటినీ మేము పడేశాం. కాని, ఇంటిలో వాళ్ళెవరూ ఆ పళ్ళను తినలేక పోయారు.

కాస్సేపట్లో సీగ్రెడ్ పిన్ని తన భర్త పీటర్‌తో సహా వచ్చింది. వెంటనే జెన్నీ పిన్ని కాఫీ తయారుచెయ్యడం ప్రారంభిస్తూ, కప్పులూ, సాసర్లూ తయారుగా ఉంచమని క్రిస్టినీతో చెప్పింది.

మేస్త్రీగా పనిచేస్తున్న పీటర్ వొంటి నిండా ఇంకా ప్లాస్టర్ రంగు అలాగే అగుపడుతోంది. అర్జంటుగా రావడంవల్ల అతను స్నానం చెయ్యలేకపోయాడని సీగ్రెడ్ పిన్ని మా అందరితోటీ చెప్పింది.

"మీ నాన్నకి వచ్చిన అనారోగ్యాన్ని గురించి జెన్నీ టెలిఫోన్ చేసింది. ఆయన స్నానం చేసిందాకా కూర్చుంటే ఏమవుతుందోనని గాభరా పడ్డాం. అందుకే వెంటనే బయలుదేరి వచ్చేశాం," అంది సీగ్రెడ్ పిన్ని.

నాన్న ఆస్పిటల్‌కి వెళ్లి చాలాసేపు అయింది. అక్కడ ఏం జరిగిందో తెలియక డాగ్‌మర్, నేనూ ఏడవడం ప్రారంభించాం. ట్రీనా పిన్ని డాగ్‌మర్‌ను ఓదార్చింది. ఆమె భర్త ఏదేనా కొనుక్కోమని మా ఇద్దరికి చెరో కాసూ యిచ్చాడు. అప్పుడే అమ్మ మౌనంగా లోపలికి ప్రవేశించింది.

గదిలో కూర్చున్నవారంతా ఒక్కసారి లేచి నిలబడ్డారు. అనేకమంది కుర్చీని ఆమె దగ్గరగా జరిపారు. ఒక కప్పులో కాఫీ పోసి, ఆమెవద్దకి పట్టుకెళ్లారు. అందరం అనేక విధాలయిన ప్రశ్నలు అడిగేశాం.

"మీ ప్రశ్నలూ, మీరూ-ఊరుకోండి. ఆమె ఇప్పుడే వచ్చింది. కాస్త ఊపిరి పీల్చనివ్వండి. వేడి వేడి కాఫీ కాస్త తాగనివ్వండి," అని పిన్ని మమ్మల్ని అందరినీ తిట్టింది.

జెన్నీ పిన్ని విచిత్రంగా లోపలికి పరుగెత్తింది. కాస్సేపటిలో నిద్ర పోతున్న మా చెల్లెలు కార్‌ని తీసుకొచ్చి, అమ్మ చేతుల్లో పెట్టింది.

"అయ్యో,పాపం! నిద్రపోతున్న ఆ పాపా యిని ఇప్పుడెందుకు లేపడం ?" అని ట్రీనా పిన్ని వాపోయింది.

జెన్నీ పిన్ని ఆమెవైపు కోపంగా చూసింది.

"మరేం ఫరవాలేదు లే. ఈ పసిపాపకి కాస్త నిద్ర లేకపోతే లోకం ఆగిపోదు."

జెన్నీ పిన్ని అలా ఎందుకు చేసిందో తర్వాత మా అందరికీ అర్థమయింది.

నేను అమ్మవైపే చూశాను. అమ్మ పసిపాపని తన చేతుల్లోకి తీసుకొని, ఒక్కసారి ముద్దు పెట్టుకొంది. ఆ పాపాయిని చూస్తూంటే, దానితో ఆడుకొంటూంటే అమ్మ మొహంలోని విచారమంతా అదృశ్య మయింది.

"ఆయన ఇంకా లేవలేదు," అంది అమ్మ మెల్లగా.

"ఇంకా లేవలేదా ?" అన్నారందరూ.

"ఆయన ఫోటోని కూడా ఆస్పిటల్‌లో తీశారు," అవి ఏం ఫోటోలో తెలియక అమ్మ ఒకసారి నెల్స్‌వైపు తిరిగింది.

"అవి ఎక్స్‌రే ఫోటోలమ్మా," అన్నాడు నెల్స్.

"అవును, జ్ఞాపకం వచ్చింది. ఎక్స్‌రేస్. ఆయన మెదడులో మునుపు ఎప్పుడో తగిలిన గాయం బాగా పెరిగి పెద్దదయిందట. వెంటనే ఆపరేషన్ చెయ్యాలిట. డాక్టర్ జాన్సన్ ఈ విధంగా చెప్పాడు," అంది అమ్మ.

"డాక్టర్ జాన్సన్ చాలా మంచివాడు," అంది జెన్నీ పిన్ని.

"జెన్నీ పిన్ని చెప్పింది నిజం. డాక్టర్ జాన్సన్ చేతుల్లో ఆయన ఉంటే, మనకి ఏ విచారమూ ఉండదు," అంది సీగ్రిడ్ పిన్ని.

అమ్మ ఎందువల్లో భోజనాలు చేసే టేబిల్ వైపు ఓసారి చూసి, తర్వాత మెల్లగా ఇలా చెప్పింది :

"డాక్టర్ జాన్సన్ ఈ ఆపరేషను చెయ్యలేనన్నాడు. అతనికంటే ఎక్కువ అనుభవం ఉన్న ఏ డాక్టరువద్దకైనా ఆయన్ని తీసుకెళ్లాలని జాన్సన్ సలహా ఇచ్చాడు. మెదడు

ఆపరేషన్ చెయ్యడంలో ప్రత్యేక నిపుణులు కొంతమంది ఇక్కడ ఉన్నారట."

"అయితే ఇంకేం! ఆ పెద్ద డాక్టరెవడో కనుక్కొని, అక్కడే ఆపరేషన్ చేయిద్దాం," అంది జెన్నీ పిన్ని.

మరుక్షణంలోనే ఆమె పడకగదిలోకి పరుగెత్తింది. ఒక సంచీని పట్టుకొని, మళ్ళా వంటింటిలోకి వచ్చింది. అందులోనుంచి కొంత డబ్బుని బల్లమీద పోసింది.

"ఇదుగో 25 డాలర్లు. ఇవి నాకు అవసరం లేదు. ప్రస్తుతం ఆపరేషన్ కోసం ఉపయోగించండి," అంది జెన్నీ పిన్ని.

ఇదంతా గమనిస్తున్న తిర్ కెల్సన్ తన భార్య ట్రీనావైపు చూశాడు. ఆమె 'అలాగే' అన్నట్టు బుర్ర ఊపింది. వెంటనే తన జేబులోంచి ఓ పొడుగాటి పర్సును తీసి, అందులో ఉన్న డబ్బంతా బల్లమీద పోశాడు.

"36 డాలర్ల, 43 సెంట్లు. ఇవి కూడా ఉపయోగించండి," అన్నాడు అతను.

ఆ క్షణంలో ట్రీనా పిన్ని సగర్వంగా తలెత్తి, అందరివైపూ చూసింది.

"మా దగ్గర ఈ 50 డాలర్లూ ఉన్నాయి. ఇది మాకు ఇప్పుడు అనవసరం. దీన్ని కూడా ఆపరేషన్‌కి ఉపయోగించండి," అంది సీగ్రెడ్ పిన్ని.

"మరో 35 డాలర్లు నాదగ్గర ఉన్నాయి. రేపు మళ్ళా నాకు జీతం వస్తుంది. ఇది నాకు అనవసరం," అన్నాడు ఓల్, మార్తా పిన్ని భర్త.

ఒక్కసారి అమ్మ తలెత్తి, టేబిల్ వైపు సూటిగా చూసింది. అందరూ అడక్కుండా హృదయపూర్వకంగా ఇచ్చిన డబ్బంతా ఆమె కళ్ళకి అగుపడింది. అంతవరకూ అమ్మ ఏడవడం నేను ఎప్పుడూ చూడలేదు. టేబుల్ మీదున్న డబ్బుమీదనుంచి అమ్మ చూపు మెల్లగా పిన్నిల మీదకీ, వాళ్ళ భర్తల మీదకీ వెళ్ళింది. తన ఉద్రేకాన్ని ఆపుకోలేక చటుక్కున తల వంచింది. ఆమె కళ్ళమ్మట నీళ్ళు జలజల రాలాయి. అమ్మ ఏడుస్తోంది.

వాళ్ళందరికీ తన కృతజ్ఞతను సూచించడానికి అమ్మ ఏవేవో చెప్పసాగింది. కాని, వాళ్ళెవ్వరూ ఆమెను మాట్లాడనివ్వలేదు.

"కష్టాలలో మనం అందరం కలసి ఉండాలి. మా బాధ్యత మేమిచ్చిన డబ్బుతో పూర్తి కాదు. ప్రతి ఆదివారం ఇటుపైన ఇక్కడికి వచ్చి, వీలు అయిన సహాయం చేస్తూనే ఉంటాం," అన్నారు అంతా ఏక కంఠంతో.

అమ్మ నోటమ్మట మాట రాలేదు. పిన్నిలందరూ లేచి, అమ్మను ముద్దు పెట్టుకున్నారు. వాళ్ళ భర్తలందరూ మాకు షేక్ హాండ్స్ ఇచ్చారు.

"ఆ పెద్దడాక్టరు పేరెవరో తెలుసా?" జెన్నీ పిన్ని అడిగింది.

"డాక్టరు బ్యూచాంప్. మెదడు ఆపరేషన్ చెయ్యడంలో ఈ ప్రాంతాల్లో అతను చాలా ఆరితేరిన వాడట. రేపు తెల్లవారగనే అతనివద్దకే వెడతాము," అంది అమ్మ.

మరునాడు ఉదయమే అమ్మా, నేనూ డాక్టర్ జాన్సన్ ఆస్పిటల్‌కి వెళ్లాం. ఆ పేరు పొందిన డాక్టరుని చూడ్డం అంత వీలు కాదని తెలుసుకొన్నాం.

"ఆయన ఎలా ఉన్నారు ?" అమ్మ ఆత్రుతగా అడిగింది.

"ఇంకా ఆయనకి మెలకువ రాలేదు. ఆపరేషను అయిందాకా మెలకువ రాదనుకుంటా," అన్నాడు డాక్టరు.

"అయితే, మనం ఊరుకుంటే లాభం లేదు. డాక్టరు బ్ర్యాఘాంప్ చేత వెంటనే ఆపరేషన్ చేయిద్దాం."

డాక్టరు జాన్సన్ ఎందుకో మా ఇద్దరినీ అదో విధంగా చూశాడు.

"ఆయన చేత ఆపరేషను చేయించడం అంత సులువు కాదు. స్వతహాగా బ్ర్యాఘాంప్ చాలా మంచివాడు. అతను విదేశీయుడు. ఇంగ్లీషు బాగా మాట్లాడ లేడు. చాలా ఆరితేరిన సర్జన్. కాని, అతనికి ఒక భార్య ఉంది. అతను ఆపరేషను చెయ్యాలంటే అందరూ మొదట ఆ భార్యని కలుసుకోవాలి. ఆమె అడిగినంత మీరు చెల్లిస్తే, అటుపైన ఆయన కత్తి ఎత్తుతాడు. ఎన్నిసార్లో ఆమెతో నేను మాట్లాడాను. ఆమె పిశాచం లాంటిది. మహా దెబ్బలాడుతూంది. ఏది ఎలాగున్నా

ఈయన బ్రతకాలంటే మీరు అక్కడికి వెళ్ళి, ఆమెని కలుసుకోవాలి; అడిగినదంతా చెల్లించాలి."

"కావలసిన డబ్బు మా దగ్గర ఉంది లెండి," అంది అమ్మ.

"అయితే, మీరు వెంటనే ఆమెవద్దకి వెళ్ళండి. నా కార్డు చూపెడితే, ఆమెని మీరు కలుసుకోవచ్చు. వెంటనే ఈ ఆపరేషను జరగాలి," అంటూ డాక్టరు జాన్సన్ ఒక కార్డుని అమ్మకి అందించాడు.

అమ్మా, నేనూ ఆస్పిటల్‌లోంచి బయటికి నడిచాం. బస్ ఎక్కాం. డాక్టర్ బ్యూఛాంప్ ఇంటికి వెళ్ళాం. డాక్టర్ జాన్సన్ ఇచ్చిన కార్డుని లోపలికి పంపించాం. కాస్సేపట్లో పొడుగ్గా ఉన్న ఒక స్త్రీ గుమ్మంవద్దకు వచ్చి, "లోపలికి రండి," అంది అధికార ధోరణిలో. అమ్మ నాన్నని గురించి చెప్పవలసిందంతా చెప్పింది.

"అవును. మీ ఆయన్ని గురించి డాక్టర్ జాన్సన్ కూడా చెప్పాడు. ఎందువల్లో జాన్సన్ అంటే నా కసహ్యం," అంది బ్యూఛాంప్ భార్య.

మేమిద్దరం గదిలోనే కూర్చున్నాం. నాన్న జబ్బును గురించి అమ్మ ఏదేదో చెప్పకు పోతోంది. డాక్టరు భార్య మాత్రం గదిలో ఇటూ అటూ తిరుగుతూ, ఈ వస్తువునీ, ఆ వస్తువునీ సర్దుకుంటూ, అమ్మ చెప్పేదంతా శ్రద్ధగా వింటున్నట్లు నాకనిపించింది. అమ్మ చెప్పిందంతా విన్నాక, చివరికి ఆమె ఇలా అంది: "ఈ ఇంటిలోకి ఈ మధ్యనే కొత్తగా మారాను. మా టేబిల్సూ, బీరువాలూ బాగు చేయించడం కోసం ఎంతమంది వడ్రంగిలనో రప్పించాను. ప్రతి వడ్రంగీ చెప్పలేనంత డబ్బు అడుగుతున్నాడు...."

డాక్టరు భార్య చెప్పినదానికీ, అంతవరకూ అమ్మ చెప్పినదానికీ ఎటువంటి సంబంధమూ లేదు.

"క్షమించండి, మాకు అర్జంట్‌గా డాక్టరు కావాలి," అంది అమ్మ.

"అవును. అనేకమందికి డాక్టరే కావాలి. అందువల్లే ఆయన కావాలని ఎవరు ఇంటికి వచ్చినా, వాళ్లతో మొదట నేను మాట్లాడుతూంటాను." అంది ఆమె.

మేము నిశ్శబ్దంగా ఉండిపోయాం.

"డాక్టరు బ్యూఛాంప్ మామూలు మనిషి కాదు. ఆయన అమెరికా దేశానికే ఒక ఆభరణం. ఆపరేషను చేసే సమయంలో ఆయన చేతులు చూస్తూంటే, ఏ మాజిక్కో జరుగుతున్నట్లు మీ కళ్ళకి అగుపడుతుంది," అని డాక్టరు భార్య చాలా ఆనందంగా తన చేతుల్ని ఒకసారి చూసుకొంది.

"అంత తెలివైన నా భర్తకి డబ్బు గణించడం ఏ మాత్రం తెలియదు. ఆర్థిక విషయాలలో ఆయనొక పసిపాప. మీరు నమ్ముతారో, లేదో - ఇంతకుముందు ఆయనే అందరితోటీ మాట్లాడి, ఎన్ని ఆపరేషన్లో చేశారు. అటువంటి ఆపరేషన్లు మరెవ్వరూ చెయ్యలేరు. అయినప్పటికీ చిల్లిగవ్వ కూడా ఆయన తీసుకోలేదు. ఆయన హృదయం మంచుగడ్డలా కరిగిపోతూంటూంది. ఏడుస్తూ ఎవరు ఏ కథ అల్లి చెప్పినా, ఆయన అట్టే నమ్మేస్తూంటాడు. డబ్బు అడక్కుండా ఆపరేషను చేస్తుంటారు."

"నా భర్త సంగతి మీకు పూర్తిగా చెప్పకొన్నాను. ఇంకా చెప్పడానికి నాకు

ప్రైమ్ లేదు. ఆపరేషను చెయ్యడానికి డాక్ట
రుని వెంటనే పంపండి. లేకపోతే మా గతి
అధోగతి అవుతుంది."

డాక్టరు భార్య సమీపంలో ఉన్న టేబిల్
వద్దకు పరుగెత్తి,ఒక రసీదు పుస్తకం,పెన్సిలూ
పట్టుకొని, మళ్ళా మాదగ్గరకి వచ్చింది.

"మీ ఆయనకి మెదడుకి గాయం తగి
లింది. మెదడు ఆపరేషను చెయ్యడం చాలా
కష్టం. ఎంతో ఖర్చుపెట్టి, డాక్టరు విద్యను
పూర్తిగా చదువుకొంటేగాని, అటువంటి
ఆపరేషన్లు చెయ్యడం వీలు కాదు. అదే
కాకుండా డాక్టర్లకూ ఖర్చులూ, కష్టాలూ
ఉంటూంటాయి. ఆవిషయం మరువకండి..."
ఆమె చెప్పుకుపోతోంది.

"ఇంతకీ, ఆపరేషనుకి ఎంతివ్వాలో
చెప్పండి," అమ్మ అడిగింది.

"350 డాలర్లు," అందామె.

కుర్చీలోంచి క్రిందకి జారిపడతానేమో
నని నాకు అనిపించింది. ఉక్కిరి బిక్కిరి అవు
తున్నట్లు అమ్మ నావైపు చూసింది.

"అంత మేము ఇవ్వలేం. నాదగ్గర 225 డాలర్లు మాత్రమే ఉన్నాయి."

"అయితే, బాగానే ఉంది. మరో 125 డాలర్లు మీరెలాగయినా గడించాలన్న మాట."

"అది ఇప్పుడు సాధ్యం కాదు."

"అయితే, ఆఖరిమాట చెప్తున్నా, వినండి. 300 డాలర్లకి డాక్టరు ఆపరేషను చేస్తాడు."

ఏమీ జవాబు చెప్పలేక అంత ఇవ్వలేనన్నట్లు అమ్మ బుర్ర అడించింది.

"మీకు చుట్టాలూ, స్నేహితులూ ఉంటారుగా? వాళ్లవద్ద అప్పు తీసుకుని, మా ఇంటికి రండి."

"చుట్టాలూ, మిత్రులూ ఇచ్చినదంతా కలిపితే 225 డాలర్లు అయింది," అంది అమ్మ దీనంగా.

"అయితే, నేనేం చేస్తాను? మీ చిక్కును మీరే విప్పుకోండి. మీకు డాక్టరు కావాలంటే, 300 డాలర్లూ ముందు చెల్లించాలి."

"నాకు సహాయపడండి. ఆయనకి ఈ వేళ ఆపరేషను తప్పకుండా జరిగి తీరాలి. నాదగ్గ రున్న 225 డాలర్లూ మీకు ఇప్పుడే ఇస్తాను తతిమ్మా 75 డాలర్లు....."

"నాదగ్గర అదేమీ లాభం లేదు. డబ్బు చెల్లిస్తే డాక్టర్ని పంపుతాను."

డాక్టరు భార్య ఇక సంభాషణ ముగిసిం దన్నట్లు లేచి నిలబడింది. అమ్మ మొహంలో నెత్తురు చుక్క లేదు.

"అవసరం ఉన్నప్పుడే మనుష్యులందరూ ఎలాగో అలాగ కావలసిన డబ్బును సృష్టి స్తారు. ఆ అవసరం దాటితే డబ్బు సంపా దించడం వీలు కాదు. అవసరం మీది. వెళ్లండి. నేను అడిగింది పట్టుకురండి. నమస్తే."

అమ్మా, నేనూ ఇంటిలోంచి బయటకు. నడిచాం. వీధి గేటు దాటాం.

"కాట్రిన్," అమ్మ కేకేసింది. చటు క్కున వచ్చి, నా చెయ్యి పట్టుకుంది.

"నాకో ఆలోచన తట్టింది. పద. మళ్ళా వెనక్కి వెడదాం," అమ్మ ఇంటివైపు పరుగెత్తింది. ఆమెను నేనూ అనుసరించాను.

మూసిన తలుపులను అమ్మ గట్టిగా తట్టింది. డాక్టరు భార్య తలుపులను తెరచి, నవ్వుతూ మావైపు చూసింది.

"ఓహో, ఇలా వెళ్ళి, అలా వచ్చారే! 75 డాలర్లు పట్టుకు రావడానికి మీకు ఆట్టే టైమ్ పట్టలేదు!"

అమ్మ జవాబివ్వలేదు. గదిలోకి ప్రవేశించింది. తన మనీపర్సులో ఉన్న డబ్బునంతనీ టీపాయిమీద పోసింది. ఓసారి డాక్టరు భార్యవైపు చూసింది.

"నా దగ్గరున్న డబ్బంతా ఇదిగో అక్కడ పెట్టాను తీసుకోండి. ఇంకా మీకు నేను కొంత బాకీ ఉంటాను. ఆ బాకీని మరో విధంగా తీర్చుకొంటాను. మీ టేబిల్సూ, బీరువాలూ బాగు చెయ్యడానికి వడ్రంగి కావాలని మొదట్లో మీరు అన్నారుగా? నేనొక వడ్రంగిని మీకు పంపిస్తా. అతనిచేత మీరు పని చేయించుకోండి. నా

బాకీ చెల్లిందాకా మీరు అతనికి డబ్బియ్యక్కరలేదు," అంది అమ్మ.

డాక్టరు భార్య టీపాయిమీద ఉన్న డబ్బుని తన మనీపర్సులో వేసుకొంది.

"అలాగే ఒప్పుకొంటున్నా. వడ్రంగిని మాత్రం త్వరగా పంపండి," అంది డాక్టరు భార్య.

"అలాగే పంపిస్తా."

"ఇదిగో మీ రసీదు. కాస్పేపట్లో డాక్టర్ని సెయింట్ జోసఫ్స్ ఆస్పటల్‌కి పంపుతాను. మీరు వెళ్ళండి."

అమ్మా, నేనూ ఆస్పిటల్ చేరుకున్నాం. కాస్సేపట్లో డాక్టరు బ్యూఛాంప్ అక్కడికి రాబోతున్నాడని డాక్టరు జాన్సన్‌తో చెప్పాం. ఈవార్త కాస్సేపట్లో ఆస్పిటల్ అంతా పాకిపోయింది. స్ట్రెచ్చర్ మీద పడుకున్న నాన్నని నర్సులు మెల్లిగా హాలులోకి మోసుకెళ్లారు. వెళ్లే ముందు మా ఇద్దరినీ ఒకసారి నాన్నని ముద్దుపెట్టుకో నిచ్చారు. నాన్న మెలుకువగా లేడు.

చాలా సేపటినుండి నిద్రపోతున్న నాన్నా, అమ్మా, నేనూ, అనేకమంది నర్సులూ డాక్టరు బ్యూ ఛాంప్ కోసం కాచుకు కూచున్నాం. ఆపరేషను గది ముందు ఒక టేబిల్ మీద నాన్నని పడుకోబెట్టారు. నాన్న చెయ్యిని ఆప్యాయంగా పట్టుకొని, అమ్మ అలాగే నిలబడింది.

"ఆపరేషను అయిపోగానే కాస్సేపట్లో ఆయన మామూలుగానే ఉంటారు," అని అమ్మ నాతో చెపుతూండేది.

కాస్సేపట్లో హాల్లోంచి పొట్టిగా ఉన్న ఒక మీసాల వ్యక్తి మేమున్నచోటికి వచ్చాడు. వెనుక వస్తున్న స్త్రీని చూడగానే ఆయనే డాక్టరు బ్యూఛాంప్ అని నాకు బోధపడింది. అనేకమంది నర్సులు డాక్టరు బ్యూఛాంప్ వైపు ఆశ్చర్యంగా చూశారు. డాక్టరు భార్య ఆయన్ని అమ్మకి పరిచయం చేసింది. డాక్టరు బ్యూఛాంప్ అమ్మ ముందు కొంచెం వంగి, నాన్న చెయ్యి పట్టుకొని, పరిశీలించాడు.

"వెంటనే ఆపరేషను చేస్తాను. కొంచెం బట్టలు మార్చుకోవాలి. అంతే," అన్నాడాయన.

"డాక్టరుగారూ, ఈ ఆపరేషను మీరు చాలా జాగ్రత్తగా చెయ్యాలి," అంది అమ్మ.

అమ్మ అలా అన్నందుకు డాక్టరు భార్యకి కోపం వచ్చింది. కాని, డాక్టరు బ్యూఛాంప్ మెల్లగా నవ్వుతూ, ఇలా చెప్పాడు:

"గాభరా పడకండి. ఈయనకి ఏ ఆపదా సంభవించదు."

"మరో విషయం: ఆ వడ్రంగిని ఎప్పుడు పంపిస్తావు?" అంది డాక్టరు భార్య అమ్మ వైపు సూటిగా చూస్తూ.

"అతని ఆరోగ్యం బాగుపడగానే పంపిస్తానండి," అంది అమ్మ ఊపిరి గట్టిగా పీలుస్తూ.

డాక్టరు భార్య ఆశ్చర్యపోతూ, అమ్మ వైపు చూసింది. స్ట్రెచర్ మీద పడుకున్న నాన్న దేహాన్ని మెల్లగా తట్టుతూ, "ఈయనే వడ్రంగి," అంది అమ్మ.

ఆ మాట వినగానే డాక్టరు భార్య మరేం చేస్తుందో అని నేనెంతో గాభరా పడ్డాను. డాక్టరు దగ్గరగా ఆమె వెళ్లింది.

"మీరు చాలా జాగ్రత్తగా ఆపరేషను చెయ్యాలి. ఇతను బ్రతికితేగాని, వడ్రంగి పని మన ఇంటిలో చెయ్యలేడు. చేస్తే కాని, మన అప్పు చెల్లదు," అందామె.

డాక్టరు చూపు తన భార్యమీదనుంచి అమ్మమీదకి మరలింది. ఎందుకో ఆయన కళ్ళు ప్రకాశించాయి. ఆయన అమ్మ రెండు చేతులూ గట్టిగా పట్టుకొన్నారు.

"మీరు నా జోహార్లు. మీలాంటి స్త్రీని ఇంతవరకూ నేను చూడలేదు. మీ భర్తకి ఏ ఆపదా రాకుండా నేను చూస్తాను."

అమ్మ నిశ్శబ్దంగా ఉండిపోయింది. స్ట్రెచర్ మీదున్న నాన్నని హాల్లోకి తీసుకెళ్లారు. మరోక్షణంలో హాలు తలుపులు మూయబడ్డాయి.

## 10

నాన్న ఆస్పిటల్లో ఉన్న ఆఖరి వారంలో క్రిందభాగంలో ఉన్న పెద్ద పడకగదిని, జార్ స్టాంటన్ అనే అన్నదమ్ములకి మేం అద్దెకిచ్చాం.

వాళ్ళిద్దరూ గేస్ అండ్ ఎలక్ట్రిక్ కంపెనీలో పనిచేసేవారు. ఒక నెల అద్దెను ముందుగానే చెల్లించారు. మా కష్టాల్లో వాళ్ళు ముందుగా ఇచ్చిన ఆ డబ్బు మాకెంతో ఉపయోగించింది. అన్నదమ్ములిద్దరూ చాలా మంచివాళ్ళు. రాత్రి భోజనాలు అవగానే ఇద్దరూ నవ్వుతూ, వంటింటిలోకి వచ్చేవారు. తన వంట ఎంతో బాగుందని అమ్మతో చెపుతూ ఉండేవారు.

కొన్ని రోజులలో మా ఇంటిలో అద్దెకి ఉంటూన్న మిస్ డ్యూరాంట్ కీ, వాళ్ళకీ బాగా స్నేహం అయింది. ఉడికించుకోకుండా ఆమె తింటూన్న కూరగాయల్నీ, వాటినీ చూసి, అన్నదమ్ములిద్దరూ మిస్ డ్యూరాంట్ ని పరిహాసంగా ఆక్షేపించేవారు. ఎప్పుడో

అప్పుడు ఆమెచేత బాగా ఉడికిన మాంసాన్ని తినిపించాలని అన్నదమ్ములిద్దరూ పందెం కూడా కట్టుకున్నారు.

మా ఇంటిలో అద్దెకున్న ముగ్గుర్నీ చూసి, ఆమె ఆనందించేది; గర్వపడేది. వాళ్ళ మాటలూ, నవ్వులూ వింటూంటే, ఆమెకి ఎంతో సంతోషంగా ఉండేది. ఆస్పిటల్ అప్పులు చెల్లించేశాక, మా పిన్నీలు ఇచ్చిన డబ్బు కూడా వాళ్ళకి ఇచ్చేశాక మా జీవితం ఎంతో సుఖదాయకంగా ఉంటుందని అమ్మ అంటూ ఉండేది. అటుపైన చేతిలో మిగిలిన డబ్బుతో మరికొన్ని బీరువాలూ, కుర్చీలూ కొనవచ్చు. ఇంట్లోని మరికొన్ని గదులని కూడా ఇతర్లకి అద్దెకివ్వొచ్చు. ఇల్లంతా అనేకమందితో కలకలలాడుతూ ఉంటుంది. భవిష్యత్తును గురించి ఇలా ఊహాగానం చేసుకొంటూ, తనలో తనే సంతోషపడేది.

చివరికి ఆస్పిటల్‌నుంచి నాన్న ఇంటికి వచ్చాడు. ఆ రోజు మా ఇంట్లో ఏదో పండుగలాగ ఉంది. పిల్లలందరం స్కూల్ మానేసి, ఇంట్లోనే ఉండిపోయాం. భోజనాలు చేసే టేబిల్‌ని దాగ్‌మర్ తన ఇష్టా

నుసారంగా పువ్వులతో అలంకరించింది. మెల్లగా నాన్న వంటింటిలోకి నడిచి, కుర్చీలో కూర్చొని, మా అందరివైపూ ఓసారి చూడ గానే మంచిరోజులొచ్చాయని అందరం అనుకొన్నాం. నాన్న మొహంమాత్రం ఇంకా పేలవంగా ఉంది; బాగా సన్నపడ్డాడు. కాని, అతని చిరునవ్వులోని కళ ఏ మాత్రం తగ్గలేదు. తలమీద ఇంకా బాండేజి కట్టే ఉంది. వంటింటిలోని కుర్చీలో కూర్చొని, ఆస్పిటల్లో జరిగిన చిన్న చిన్న విషయాలను గురించి నాన్న నవ్వుతూ చెప్పేవాడు. ఒక రోజు తనకి తెలియకుండా తలమీద ఉన్న వెంట్రుకలనన్నిటినీ ఆస్పిటల్‌లోనివాళ్ళు కత్తిరించివేశారుట.

ఇంట్లో తిరుగుతున్న నాన్ననిచూ స్తుంటే, మాకేదో కొత్తగా, ఆనందంగా అగుపడేది. నేను స్కూలుకి వెళ్ళి తిరిగి వచ్చేసరికి నాన్న వంటింటిలో ఉండేవాడు. తిన్నగా నాన్నవద్దకు వెళ్ళి, స్కూలులో జరిగినవాటిని గురించి చెప్పేదాన్ని.

రోజులు జరిగినకొద్దీ పిన్‌ఫోర్డ్ స్కూలు ఆనాటి జీవితంలో చెప్పలేనంత ప్రాముఖ్యతని

వహించింది. స్కూలులోని పిల్లలందరూ
ఇప్పుడు నన్ను స్నేహభావంతో చూసే
వారు. ఎక్కడ ఏ పార్టీ జరిగినా కార్ని
వీటానీ, నన్నూ తప్పకుండా ఆహ్వానించే
వారు. అదే కాకుండా ప్రతి బుధవారం
స్కూలుపిల్లలు మా ఇంటికి వచ్చేవారు.
నా చిన్నగదిలో అందరం కూర్చొని, చాక్లెట్
తినేవాళ్ళం. మేము జీవితంలో చేయబొయ్యే
వాటిని గురించి ఉత్సాహంతో చర్చించుకునే
వాళ్ళం.

జీవితంలో ఎప్పుడూ విడిపోకుండా ఎల్ల
ప్పుడూ స్నేహభావంతో ఉంటామని తీర్మా
నించుకొనేవాళ్ళం. విన్‌ఫోర్డ్ స్కూల్లో నా
చదువు పూర్తి అయ్యే సమయం వచ్చింది.
ఆ సందర్భంలో స్కూలు పిల్లలందరూ ఒక
నాటకం ప్రదర్శించడానికి నిశ్చయించు
కొన్నారు. ఆ నాటకంలోని రెండో ముఖ్య
పాత్ర నాకే లభించింది. అటువంటి పాత్ర
నాకిచ్చినందుకు నేనెంతో గర్వపడ్డాను.
ఆ పాత్రలో నేనొక గ్రీక్ యువకుడిలా నటిం
చాలి. ఆ పాత్రకి కావలసిన మేకప్ వస్తు
వులూ, దుస్తులూ మొదలయినవన్నీ ఊళ్ళో

ఉన్న షాప్‌కి వెళ్ళి, నేనే కొని పట్టుకొచ్చాను. అసలు నాటకం జరిగే ముందు గ్రీస్ యువ కుడిలా తయారయి, ఎప్పుడో స్టేజ్ మీద నేను చెప్పవలసిందంతా నాన్న ముందు నిల బడి నటిస్తూ చెప్పేదాన్ని. ఇంటిల్లిపాదీ చప్పట్లు కొడుతూ ఉండేవాళ్ళు.

స్కూలు పిల్లలందరం మాకు రాబోయే బహుమతుల్ని గురించి మాట్లాడుకొనేవాళ్లం. తనకి ఒక అందమైన ఉంగరం రాబోతోం దని మేడలీన్ చెప్పింది. హెస్టర్‌కి వాళ్ళ వాళ్ళు ఒక అందమైన రిస్ట్‌వాచ్ ఇస్తున్నా రట. చిన్నతనంలో తైరాకోసం కొన్న గొలుసుకి ఆమె తల్లిదండ్రులు ఏడు ముత్యాలు వేయించి, ఆమెకి ఇవ్వబోతున్నారట. కార్మెలీటాకు కూడా ఏదో అఖండమైన వస్తు వులు బహుమతిగా వస్తున్నాయట.

వాళ్ళందరికీ రాబోయే బహుమతులను గురించి ఆలోచిస్తుంటే, మా వాళ్ళు నాకేమి స్తారో అని ఆశ్చర్యపడేదాన్ని. అమ్మ, నాన్న వంటింటిలో ఉండగా బహుమతుల్ని గురించి వాళ్ళతో చెపుతూండే దాన్ని.

వాళ్ళు ఇవ్వబొయ్యేదేదో ముందుగానే కనుక్కోవాలని నాకు ఆత్రంగా ఉండేది.

"కాత్రిన్, స్కూలు చదువు పూర్తి అయ్యే సమయంలో బహుమతులు ఇవ్వడం ఇక్కడ అనుయాయితి అన్నమాట?" అంది అమ్మ ఒకసారి.

"అదేమిటమ్మా, అలా అడుగుతావు? విన్‌ఫోర్డ్ స్కూలు చాలా పేరు పొందింది. ఈ స్కూల్లో ఆఖరి క్లాసు పాసయ్యే సమయంలో ప్రతి విద్యార్థికీ వాళ్ళవాళ్ళు ఏదో బహుమతి తప్పకుండా ఇస్తారు. మీరు కూడా అలాగే ఇవ్వాలి," అన్నాను.

ఒకరోజు స్కూలుకి వెళ్తూండగా షిల్లర్ షాపులో ఉన్న ఒక్క వస్తువు మీదకి నా చూపు వెళ్ళింది. అప్పటినుంచీ నా హృదయం దానిమీదే ఉంది. అది నాకు కొనిస్తారని వీలయినప్పుడల్లా ఆ వస్తువును గురించే లౌక్యంగా ఇంట్లో వాళ్ళ ముందు ప్రసంగించేదాన్ని. కాని, ఒక రోజు నెల్స్ నా చెయ్యి పట్టుకొని, నన్ను గదిలోంచి దూరంగా తీసుకుపోయాడు.

"కాత్రిన్, అటువంటి వస్తువు లేవీ కావాలని మరీ మరీ అడగకు. ప్రస్తుతం అమ్మదగ్గర డబ్బు లేదు. ఆస్పిటల్‌కీ, పిన్నిలకీ మనం ఇంకా ఎంతో బాకీ ఉన్నామన్న విషయం నువ్వు మర్చిపోతున్నావు. అదీ కాకుండా నాన్న ఆరోగ్యం కాస్త బాగుపడగానే, డాక్టర్ డ్యూఛాంప్ ఇంటికి వెళ్లి, వడ్రంగిపని చెయ్యాలి. ఆ పనికి మనకు డబ్బు రాదు," అన్నాడు నెల్సన్.

"అదంతా నీ కెందుకు?" నిర్లక్ష్యంగా జవాబిచ్చాను. "స్కూల్లోని ప్రతి విద్యార్థికీ వచ్చినట్లు నాకూ కూడా ఏదో బహుమతి రావాలి. నాకు బహుమతి రాకపోతే, స్కూల్లోని వాళ్ళంతా నన్ను వెక్కిరిస్తారు."

నా జవాబు వినగానే నెల్సన్‌కి విసుగెత్తింది. నేను ఓడయి పోతున్నానని నెల్సన్ అన్నాడు.

155261

"నువ్వు క్రూరవాడివి, నా బాధ నీకేం తెలుసు?" అన్నాను నెల్సన్ ముద్దుగా.

ఒక రోజు అమ్మా, నేనూ ఒంటరిగా కూర్చున్నాం. తన వద్ద ఉన్న [illegible]

పిన్ను నాకు నచ్చిందా, అని అమ్మ అడిగింది. ఆ పిన్ను అంటే అమ్మకి ఎంతో ఇష్టం. అమ్మమ్మ ఆ పిన్నుని అమ్మకు ఇచ్చిందట.

"అమ్మా, అంత పాత గాను పిన్ను నేనేం చేసుకుంటాను?" అడిగాను.

"కాట్రిన్, పాత వస్తువులకి ఈ లోకంలో విలువ ఎక్కువని మర్చిపోకు. ఆ గాను పిన్ను మీ అమ్మమ్మది," అంది అమ్మ.

"అయితే, అలాగే-అదే తీసుకొంటాను."

"ఆ పిన్నుకి బాగా మెరుగు పెట్టించి, నీ కిస్తాలే."

ఓ సారి బుర్ర ఆడించి, అమ్మ కళ్ళల్లోకి అదో విధంగా చూశాను.

"నీ కెన్నిసార్లో షిల్లర్ షాపులో ఉన్న ఆ వస్తువుని గురించి చెప్పాను. అటువంటి దేదైనా నాకు బహుమతి ఇస్తే, అది నేను గర్వంగా నా స్నేహితులకి చూపించవచ్చు."

నా హృదయంలో ఉన్న కోరికని మళ్ళా అమ్మ ముందు ఆ క్షణంలో కక్కేశాను. అమ్మ ఏమీ మాట్లాడ లేదు. తను తీసి

నా కియ్యబోతున్న ఆ గౌను పిన్నును మళ్ళీ తన గౌనుకే పెట్టుకుంది. ఓసారి విచారంగా నా వైపు చూసి, మెల్లగా లోప లకి వెళ్ళింది.

ఎలాగో అలాగ షిల్లర్ షాపులో ఉన్న ఆ వస్తువుని అమ్మ కొని, నాకు బహుమతి ఇస్తుందని నేను ఆశించేదాన్ని...మా క్లాసు పిల్లలు ఎప్పుడేనా నన్ను ప్రశ్నిస్తే, వాళ్ళను నా కూడా షిల్లర్ షాపు ముందుకు తీసు కెళ్ళి, గ్లాసు వెనుకనున్న ఆ వస్తువునే వాళ్ళకి చూపించేదాన్ని. దాన్ని చూసి, ఎంతో బాగుందని అందరూ అనేవారు. ఆ వస్తువు సెల్యులాయిడ్‌తో చెయ్యబడింది. తెరిచి ఉన్న పెట్టెలో దువ్వెన, బ్రష్, అద్దం, బట్టలని తుడుచుకునే బ్రష్ మొద లయిన చిన్న చిన్న వస్తువులెన్నో ఉన్నాయి.

చివరికి స్కూల్లో నాటకం ప్రదర్శించ వలసిన రోజు వచ్చింది. నా పాత్రకు సంబం ధించిన సంభాషణలో ఒక్క పదం కూడా మరచిపోకుండా నేను చెప్పగలిగాను. మిస్

స్కాన్‌లన్ నా పాత్రను నే నెంతో బాగా నిర్వహించానని మెచ్చుకొంది. నాటకం పూర్తి అవగానే నా 'డిప్లొమా' సర్టిఫికేట్ తీసుకోడానికి వేదిక మీదికి వెళ్లాను. కొన్ని నిమిషాలపాటు హాలులో కూర్చున్న వాళ్ళందరూ చప్పట్లు కొడుతూనే ఉన్నారు. అదంతా చూస్తుంటే, నాకు చెప్పలేనంత ఆనందంగా ఉంది. స్కూలు హాల్లో పిన్నిలూ, వాళ్ళ భర్తలూ కూడా వచ్చి కూర్చున్నారు. అందరితోటీ కలసి, వాళ్ళు కూడా చప్పట్లు కొట్టారు. అందరితో సహా, నా దగ్గరి బంధువులు కూడా నన్ను మెచ్చుకోడం గమనించి, నే నెంతో సంతోషించాను.

అలసటతో ఇల్లు చేరుకొన్నాను. అంత వరకూ నేను కలలు కంటున్న ఎర్రటి సెల్యులాయిడ్ పెట్టె ఇంట్లో నా కోసం తయారుగా ఉంచబడింది. ఆ పెట్టెను చూడగానే ఒక్కసారి ఆనందంతో గంతులేశాను. నా ఆనందాన్ని చూసి, అమ్మా, నాన్నా ఎంతో సంతోషించారు. కాని, క్రిస్టినీ, నెల్స్ ఎందువల్లో అదో విధంగా మొహాలు పెట్టుకొని కూర్చున్నారు. అటువంటి ఆనంద

సమయంలో వాళ్ళిద్దరూ ఆ విధంగా ఉండడం నన్ను కొంత బాధ పెట్టింది. నా మీద వాళ్ళిద్దరికీ ఏదో అసూయ ఏర్పడి ఉంటుందని నాలో అనుకొన్నాను. ఆ ఎర్రటి పెట్టెని జాగ్రత్తగా పట్టుకొని, నా గదిలోకి వెళ్లాను. పెట్టెను తెరిచి, అందులో ఉన్న చిన్న చిన్న వస్తువు లన్నిటినీ నా డ్రెస్సింగ్ టేబుల్ మీద ఉంచాను. ఆ రాత్రి ఎంతో హాయిగా నిద్రపోయాను.

మర్నాడు ప్రొద్దుటే ఆలస్యంగా లేచాను. మామూలుగా అమ్మ ప్రతిరోజూ వచ్చి, నన్ను ప్రొద్దుటే లేపేది. కాని, ఆ రోజు అమ్మ నన్ను లేపడం మానివేసింది. మొహం కడుక్కొని, అల్పాహారం తినటానికి నేను వంటింట్లోకి వెళ్లేసరికి, అమ్మ అగుపడ లేదు. అంతకు ముందే అమ్మ బజారుకి వెళ్లింది. నెల్సన్ మాత్రం ఏదో దిన పత్రిక తిరగేస్తూ కూర్చున్నాడు. ఎక్కడేనా ఉద్యోగాలు ఖాళీగా ఉన్నాయేమో నని పరీక్షగా చూస్తున్నాడు. క్రితం రాత్రి జరిగిన సంఘటన మూలంగా నేను నెల్సన్‌తో మాట్లాడ లేదు. వంటింటిలో నా పని

ముగించుకొని, మెల్లగా మేడమీదికి వెళ్లి పోయాను. మేడమీద గదుల్లో ఉన్న పరుపుల్ని శుభ్రపరుస్తుండగా, క్రిస్టీనీ నా దగ్గరగా వచ్చింది. దాన్ని చూడగానే కింద నా గదిలో దాచుకొన్న ఆ ఎర్రటి పెట్టె నాకు జ్ఞప్తికి వచ్చింది. నేను చేస్తున్న పనిని క్రిస్టీనీకి అప్పచెప్పి, గబగబా క్రిందకి పరిగెత్తాను. నా గదిలోకి వెళ్లాను. డాగ్మర్ కూడా నాతోటి వచ్చింది. ఎంతో ఆనందంతో నాకు బహుమతిగా వచ్చిన వచ్చిన ఆ వస్తువుల్ని చూస్తూ నిలబడి పోయాను. డాగ్మర్ అల్లరిగా నేను టేబుల్ మీద పెట్టిన వస్తువుల్ని ముట్టుకోబోయింది. దాన్ని గట్టిగా తిట్టాను. భయపడుతూ, డాగ్మర్ ఏడ్వసాగింది.

అదే సమయంలో డాగ్మర్ ఏడుపు విని, మేడమీదనుంచి క్రిస్టీనీ నా గదిలోకి పరుగెత్తుకొచ్చింది. డాగ్మర్ కన్నీళ్లు తుడిచి, నాన్నతో వెళ్లి చెప్పమని, దాన్ని పంపించింది. నేనేదో అపరాధం చేసినట్లు క్రిస్టీనీ నా వైపు అదో విధంగా చూస్తూ, నిలబడింది.

"ఎందుకలా చూస్తావు ?" అడిగాను.

"నీకు కావలసిన బహుమతి నీకు వచ్చిందని మురిసిపోతున్నావు కదూ? ఎవరు ఏమైతే నీకేం? అది కొన్నదాకా అమ్మని చంపుకు తిన్నావు. కాని, ఆ వస్తువులన్నీ ఎందుకు పనికొస్తాయి?" అంది క్రిస్టినీ.

నాకు పట్టలేనంత కోపం వచ్చింది.

"క్రిస్టినీ, అనవసరంగా పేలకు. దాని విలువ నీకేం తెలుసు? ఆ బహుమతి నాకు వచ్చినప్పటినుంచీ, నువ్వు ఈర్ష్యతో మండుతున్నావు. అలా ఉండడం మంచిది కాదు. నీ గురించి అమ్మతో తప్పకుండా చెబుతాలే."

"నాకేం భయం లేదు; అమ్మతో చెప్పుకో. అమ్మని మరో విషయం కూడా అడగడం మర్చిపోకు. ఇన్నేళ్ళబట్టీ అమ్మ దగ్గరుండే ఆ వెండి గౌను పిన్ను ఏమయిందో కనుక్కో. అమ్మమ్మ దగ్గరనుంచి వంశ పారంపర్యంగా వచ్చిన ఆ గౌను పిన్ను ఇప్పుడెక్కడుందో తెల్సుకో."

దాని మాటలు వింటూంటే నేను ఆశ్చర్యపడ్డాను.

"అంటే అర్థం? అమ్మ ఆ వెండి, పిన్నుని..."

క్రిస్టినీ జవాబియ్యలేదు. నా వైపు పరిహాసంగా చూస్తూ, వెళ్ళిపోయింది.

అటుపైన నేను ఏం చేస్తున్నానో నాకే తెలియదు. ఆ పెట్టెలోంచి తీసిన వస్తువులన్నిటినీ మళ్ళా ఎప్పటిలా పెట్టెలో పెట్టివేశాను. ఎర్రటి ఆ సెల్యులాయిడ్ పెట్టెని చేత్తో పట్టుకొని, కంగారుగా వంటింటిలోకి పరుగెత్తాను. నాన్న కాఫీ తాగుతున్నాడు. డాగ్‌మర్ తన బొమ్మతో ఆడుకుంటూంది. నాన్నతో ఏం చెప్పాలో నాకు తెలియలేదు. క్రిస్టినీ అన్న ఆఖరి మాటలు నా చెవుల్లో మ్రోగుతున్నాయి. నా కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి.

"నాన్నా, క్రిస్టినీ ఏమిటి అలా అంది?" అని, ఊరుకొన్నాను.

"ఊరుకో; ఆ విషయం ఎత్తకు," అని నాన్న నా భుజంమీద మెల్లగా తట్టాడు.

ఏడుస్తున్న నా మొహంలోకి చూసి, నాన్న చిరునవ్వుతో ఒక పంచదార పలు

కను చెంచాతో ఎత్తి, ఆప్యాయంగా నా నోట్లోకి వేసి తినిపించాడు. ఆ రోజుల్లో మా ఇంట్లో చిన్న పిల్లలకి కాఫీ దొరికేది కాదు; పెద్దవాళ్ళు మాత్రమే కాఫీ తాగే వారు. అందువల్ల పంచదార తినడమంటే మాకెంతో ఆనందంగా ఉండేది.

నాన్న పరామర్శ మూలంగా నేను ఏడ వడం మానేశాను. తర్వాత దీనంగా నాన్న ఇలా అన్నాడు:

"కాత్రిన్, షిల్లర్ షాపులో ఉన్న ఆ పెట్టె కావాలని నువ్వు ఎంతో కోరుకొన్నావు. మీ అమ్మ వెండి గౌను పిన్ను ఇస్తే, నీకు అంత ఇష్టం లేకపోయింది. మీ అమ్మా, నేనూ కోరేది ఎప్పుడూ నీ ఆనందమే. అందువల్ల ఆ వెండి గౌను పిన్నుని షిల్లర్‌కి అమ్మేసి, దానికి బదులుగా నీకు కావలసిన ఆ ఎర్రటి పెట్టెని మీ అమ్మ పట్టుకొచ్చింది."

"అమ్మని నేనలా చెయ్యమని ఎప్పుడూ అనలేదు నాన్నా! అలా చెయ్యవలసి వస్తుం దని నాకు ఇంతకు ముందే తెలిసి ఉంటే, ఇది జరగకుండా చూసేదాన్ని."

"దాన్ని గురించి ఇక ఆలోచించకు. నీ ఆనందంకోసం మీ అమ్మ అలా చేసింది."

"అయినప్పటికీ ఆ వెండి గౌను పిన్నంటే అమ్మకి ఎంతో మక్కువ. అంత పాతవస్తువు ఈ విధంగా మరొకరి చేతుల్లోకి పోవడం మంచిది కాదు నాన్నా."

"ఊరుకో, కాట్రిన్! ఆ గౌను పిన్ను నీ కెలాగా ఇవ్వాలని మీ అమ్మ నిశ్చయించింది. అది అమ్మేసి, నీకు కావలసిన పెట్టెను కొనిచ్చింది."

ఆలోచిస్తూ, లేచి నిలబడ్డాను. ఇక నాన్నతో మాట్లాడి లాభం లేదు. కాని, నేనేం చెయ్యవలసిందీ నా కళ్ళ ముందు కట్టినట్టు అవుపడుతోంది. ఆ పెట్టెను అలాగే చేతిలో పట్టుకొని, శరవేగంగా పిల్లర్ షాపు వద్దకు పరుగెత్తాను. పాపం! ఎంత బాధ పడుతూ అమ్మ ఆ వెండి పిన్నుని అమ్మి ఉంటుందో! షాపు యజమాని పిల్లర్ని కలుసుకొన్నాను. నా చేతిలో ఉన్న ఎర్రటి పెట్టెను అతని ముందు పెట్టాను. దాన్ని తెరచి, కొంతసేపటి వరకూ అతను అందులోని వస్తువుల్ని పరీక్షగా చూశాడు. ఆ పెట్టె

తీసుకొని, మా అమ్మ ఇచ్చిన వెండి పిన్నుని నాకిచ్చివెయ్యమన్నాను. కాని, అతను ససేమిరా ఒప్పుకో లేదు. అతని భార్య పుట్టిన రోజుకి ఆ వెండి పిన్నును బహుమతిగా ఇవ్వాలని అతను అనుకొంటున్నాడట. చివరికి ఎలాగైతేనేం-ఆ వెండి గౌను పిన్ను నాకియ్యడానికి అతను నప్పుకున్నాడు. కాని, నా దగ్గరున్న పెట్టె కాక అతనికి మరి కొంత డబ్బు నేనియ్యాలి. కొంతసేపు ఆలోచిస్తూ, నిలబడ్డాను. చివరికి అతనితో ఇలా అన్నాను:

"నా దగ్గర డబ్బు లేదు. కాని, ప్రతి శనివారం ఇక్కడకొచ్చి, నీ షాపుని శుభ్ర పరుస్తూంటాను. నాకు జీతం అక్కర లేదు."

నా మాటలు వినగానే పిల్లర్ కొంచెం విచారంతో నావైపు చూశాడు. అతను ఎంతో జాలి హృదయం గలవాడని వెంటనే తెలుసుకొన్నాను. నేనలా ప్రతి శనివారం వచ్చి తన షాపులో పనిచెయ్యవలసిన అవు సరం లేదన్నాడు. లోపలికి వెళ్లి, వెండి గౌను పిన్నుని తెచ్చి, నాకు అందించాడు. సంతో షంతో అతనికి ధన్యవాదాలు అర్పించాను.

"నీకు కావాలంటే శనివారం వచ్చి నా షాపులో మాత్రం పనిచెయ్యొచ్చు. కాని, జీతం మీాద," అన్నాడతను.

పట్టలేని ఆనందంతో షాపులోంచి బయటికి పరుగెత్తాను. మా అమ్మమ్మ రోజుల నుంచీ వస్తున్న వెండి గౌను పిన్ను మళ్లా నా చేతుల్లో ఉన్నందుకు గర్వించాను. అదే కాకుండా షిల్లర్ షాపులో ఉద్యోగం కూడా దొరికింది. ఇంటికి పరుగెడుతూ, ఆ ఎర్రటి పెట్టెను గురించి నాలో నేనే ఆలోచించుకొన్నాను. ఎందువల్లో ఆ పెట్టె అంటే అసహ్యించుకోకుండా ఉండలేక పోయాను.

తిన్నగా వంటింట్లోకి వెళ్లాను. నా చేతిలో ఉన్న వెండి పిన్నుని నాన్న ముందున్న టేబుల్ మీాద పెట్టాను. పిన్ను మీాదనుంచి నాన్న దృష్టి నా మీాదకి మరలింది. నేను చేసిన దానికి నాన్న ఎంత గర్విస్తున్నాడో ఆయన మొహం చూడగానే నాకు తెలిసింది.

"నాన్నా, ఇటుపైన ఈ వెండి పిన్ను ఎప్పుడూ నాదగ్గరే ఉంచుకొంటా," అన్నాను.

"మంచిది, కాత్రిన్. నువ్వు అలా చేస్తే, మీ అమ్మ ఎంతో సంతోషిస్తుంది."

మళ్లా నాన్న కాఫీ కప్పులోంచి ఒక పంచదార ఉండని స్పూన్‌తో ఎత్తి, నా నోటికి దగ్గరగా పట్టుకున్నాడు. నేను వొద్దని బుర్ర ఆడించాను.

"వద్దన్నమాట. అయితే, నీకేం కావాలో నాకు తెలుసు," అన్నాడు నాన్న ముక్తసరిగా.

నాన్న కుర్చీలోంచి లేచాడు. స్టవ్ దగ్గరగా వెళ్లాడు. కాస్సేపట్లో ఒక కప్పు కాఫీ కలిపి, నా దగ్గరకి పట్టుకొచ్చాడు. ఆ కాఫీ కప్పుని చూస్తూ, నేను ఆశ్చర్యపోయాను.

"ఆ కాఫీ నాకే?" ఆత్రుతగా అడిగాను.

నాన్న నవ్వుతూ, ఇలా జవాబిచ్చాడు:

"అవును, కాత్రిన్. ఈ కాఫీ నీకే. ఇంత వరకూ మనింట్లో పెద్దవాళ్ళే కాఫీ తాగుతున్నారు. ఈ నాడు నువ్వు చేసిన పని మూలంగా నువ్వు పెద్దదాని వయ్యావని రుజువు చేసుకొన్నావు. ఇదిగో కాఫీ, తీసుకో."

గర్వంతో కుర్చీలోకి వాలాను. నాన్న అందిచ్చిన కాఫీ కప్పుని తీసుకొన్నాను. ఆ క్షణంనుంచీ మా ఇంట్లో నేనొక పెద్ద దాన్ని అయ్యాను.

## 11

విన్ ఫోర్డ్ స్కూల్లో నా చదువు పూర్తి అయింది. అప్పట్లో మా ఆర్థిక పరిస్థితులు బాగుగా లేవు. పిల్లర్ అండ్ సన్ వాళ్ళ మందుల షాపులో నేను ఉద్యోగానికి చేరాను. ఆ కంపెనీకి పిల్లర్ ప్రొప్రయిటర్ గా ఉండే వాడు. అక్కడ పనిలో చేరిన కొద్దికాలం లోనే మందుల విషయాల్లో నేను ఎంతో జ్ఞానం సంపాదించాను. అదే కాకుండా ఆ షాపులో ప్రతి మందు పేరూ లాటిన్ భాషలో వ్రాసి ఉండేది. ఆ పేర్లన్నీ బట్టీ పెట్టేశాను. ఇంట్లో వాళ్ళ ముందు నాకు తెలిసిన మందుల పేర్లను లాటిన్ భాషలో చెప్పి, వాళ్ళను ఆశ్చర్యపరుస్తూ ఉంటే, నాకెంతో ఆనందంగా ఉండేది. మా ఇంట్లో ఎవరికీ లాటిన్ తెలియదు. నెల్సన్‌కు మాత్రం కొద్దిగా తెలుసు. కాని, ఎక్వా ఎరాంటీ ఫోర్లా, ఎక్వా మెంథా పెప్ – ఇటువంటి ఏ

మందుల పేర్లో గట్టిగా చెప్పి, నెల్సని గాభరా పెట్టేదాన్ని. నేను చెప్పిందేదో తెలియక నెల్స మౌనంగా ఉండిపోయేవాడు.

"అరే, భగవాన్ ! ఈ పదాల అర్థం కూడా తెలియదా? ఎక్వా మెంథా పెప్ అంటే పిప్పరమెంట్లు. ఎక్వా ఎరాంటీ ఫ్లోరా అంటే నారింజ పువ్వు నీళ్ళు," అనే దాన్ని—గర్వంగా నెల్సని వెక్కిరిస్తూ.

ఆ లాటిన్ పేర్లన్నీ మానవులకు అనవసరం అన్నట్టు నెల్స నా వైపు చూసేవాడు.

"ఈ పేర్లు లేకపోతే, మనుషులు బతకలేరు. ప్రతి వ్యక్తికీ ఏదో రోగం వస్తూ ఉంటుంది. ఈ లాటిన్ పేర్లు తెలిస్తేనే ఎవరికి ఏ మందు కావలసినా మనం ఇయ్యగలం. నిజం చెప్పాలంటే నేను లేకపోతే, పిల్లర్ షాపు మూసెయ్యవలసివస్తుంది. ఇంతవరకూ అతను ఆ మందులషాపుని నేను లేకుండా ఎలా నడుపుకొచ్చాడా అని ఆశ్చర్యపోతూ ఉంటాను," అన్నాను మళ్ళా నెల్సతో.

నెల్సన్ ముందు అలా అన్నా, నేను ఉన్నా లేకపోయినా ఆ షాపు తప్పకుండా నడుస్తుందని నాకు తెలుసు. ష్లిల్లర్ భార్య ఉన్నంత కాలం ఆ షాపుకి ఏ ప్రమాదమూ రాదు. మిసెస్ ష్లిల్లర్ కి మొదటినుంచీ ఎందువల్లో నేనంటే అసూయ ఏర్పడింది. ఆమె భర్త నాకు ఉద్యోగం ఇవ్వడం ఆమెకి ఏ మాత్రం ఇష్టం లేదు. మొదట్లో ఆమె నన్ను వెళ్లిపొమ్మని చెప్పింది. నేనక్కడ ఉండగానే భార్యాభర్త లిద్దరూ కొంతసేపు చర్చించుకొన్నారు.

"నువ్వొక్క విషయం మర్చిపోతున్నావు. ఈ అమ్మాయి మన షాపులో ఉంటే, నువ్వు మధ్యాహ్నం స్వేచ్ఛగా ఇంట్లో కూర్చోవచ్చు. అందువల్ల ఈమెకి ఉద్యోగం ఇస్తున్నా," అన్నాడు ష్లిల్లర్.

చివరికి ఎల్లాగయితేనేం – ఆమె ఒప్పుకొంది. కాని, నెలరోజులపాటు ఏ జీతమూ తీసుకోకుండా నేను పని చెయ్యాలని చెప్పింది. 'అలాగే,' అన్నాను.

ప్రతిరోజూ మధ్యాహ్నం మూడు గంటల పాటు ఆ మందుల షాపులో పని చేస్తుండే

దాన్ని. శనివారం మాత్రం ప్రొద్దుటే షాపుకి వెళ్ళేదాన్ని. మొదటి రోజుల్లో నాకంతగా పని లేదు. గ్లాసు బీరువాలనీ, టేబిల్సనీ ఏదో గుడ్డ పెట్టి, శుభ్రంగా తుడిచేదాన్ని. అప్పట్లో ఏ మందులీ ఫిల్లిప్ నన్ను ముట్టుకోనిచ్చే వాడు కాదు.

కొన్ని రోజులు గడిచేసరికి మందులు కూడా నేనే ఇచ్చేదాన్ని. డాక్టరు వ్రాసిన చీటిని ముందు పెట్టుకొని, దాని ప్రకారం మందులు కలిపి ఇస్తుంటే, ఏదో ఘనకార్యం చేస్తున్నా ననిపించేది. రోజులు గడుస్తున్నాయి. అనేక విధాలయిన మందులతోటి నాకు బాగా పరిచయమయింది. మందుల షాపులో ఎక్కువ కాలం గడిపేదాన్ని. నా మెదడులో ఎన్నో ఊహలు తిరిగేవి. ఎప్పుడో అప్పుడు నేను ఏ పెద్ద డాక్టర్నో, కెమిస్టో తప్పక అవుతానని కలలు కనేదాన్ని.

ఫిల్లిప్ చాలా మంచివాడు; నెమ్మదస్తుడు అతను నా పక్కనే నిలబడి, నా పనంతా ఎంతో జాగ్రత్తగా నేర్పాడు. కాని, అతనికి ఒక్కొక్కసారి కోపం వస్తూ ఉండేది. సీసాలో పోసేటప్పుడు మందు ఏ బల్ల

ఏదైనా కాస్త కారిపడితే, అతను నన్ను తిట్టేవాడు. అదే కాకుండా మందుల షాపులో ఒక మూల ఎన్నో చాక్లెట్ పేకెట్లున్నాయి. ఎవ్వరూ లేనప్పుడు అవి నేను రుచి చూస్తానేమో అని అతని భయం.

చివరికి మందుల షాపులో ఇంకా ఎక్కువ గంటలు పని చెయ్యసాగాను. ఆలస్యంగా షాపునుంచి ఇంటికి తిరిగి వెళుతూండేదాన్ని. ఆ కొన్ని రోజుల్లోనూ ఎంత జ్ఞానమో సంపాదించాను. హైడ్రో సైనిక్ ఆసిడ్ ఒక బీరువా సొరుగులో పెట్టి, తాళం వెయ్యబడి ఉండేది. ఆ సొరుగుకి తాళం ఎందుకు వేసిందీ తర్వాత నాకు బోధపడింది. హైడ్రో సైనిక్ ఆసిడ్ చాలా ప్రమాదకరమైన విషమని తర్వాత నేను తెలుసుకొన్నాను. మందుల్ని గురించే కాకుండా షాపులోకి వచ్చిన వాళ్ళతో చమత్కారంగా ఎలా మాట్లాడవలసిందీ కూడా నేర్చుకొన్నాను. ఆ షాపులో తెలుసుకోవలసిందంతా నాకు పూర్తిగా తెలిసిపోయిందని నాలో నేనే భావించుకొనే దాన్ని.

ఫిల్లర్ అప్పుడప్పుడు నన్ను షాపులో ఒంటరిగా విడిచిపెట్టి, భోజనానికి తన ఇంటికి వెళ్ళేవాడు. ప్రతిరోజూ మధ్యాహ్నం ఒంటి గంటనుంచి రెండు దాకా ఫిల్లర్ షాపు పూర్తిగా నా చేతులమీదే నడిచేది. అత్యవసరమైన పని ఏదేనా వస్తే, ఇంటి దగ్గ రున్న ఫిల్లర్‌కి నేను టెలిఫోన్ చేసేదాన్ని.

నేను ఒంటరిగా ఉన్న సమయంలోనే కార్మెవీటా షాపుకి వస్తూండేది. కార్మెవీటా, నేనూ కలసి మాట్లాడుకుంటూండే వాళ్ళం. మందులు కొనుక్కోడానికి ఎవరన్నా షాపుకి వస్తే, కార్మెవీటా మేము అమ్ముతున్న ఏ పత్రికలనో తిరగేస్తూ ఉండేది.

"ఆ పత్రికలన్నీ కూడా జాగ్రత్తగా చూడండి. మీకు కావలసిన పత్రిక వాటిలో దొరుకుతుందేమో!" అని కార్మెవీటాతో చెప్పి, అప్పుడే షాపులోకి వచ్చిన వాళ్ళ దగ్గరకు వెళ్ళేదాన్ని.

తను ఏ పత్రికో కొనుక్కోడానికి వచ్చి నట్టు కార్మెవీటా నటిస్తూ, షాపులో ఉన్న పత్రికలను తిరగేస్తూ ఉండేది.

మళ్ళా మేమిద్దరమే షాపులో ఉన్న మరుక్షణంనుంచీ మా పిచ్చాపాటీ ప్రారంభం అయ్యేది. విన్‌ఫోర్డ్ స్కూలు గురించీ, తదితర విషయాలగురించీ ఏవేవో మాట్లాడుకునేవాళ్ళం. కొంతసేపటికి మా దృష్టి షాపులో ఉన్న చాక్లెట్ల మీదికి వెళ్ళేది. చాక్లెట్లంటే నాకూ, కార్మెపీటాకీ కూడా చాలా ఇష్టం. ఆ చాక్లెట్లని చూస్తూంటే, పై కాగితం తీసేసి, తినాలని అనిపించింది. చెయ్యి చాచేదాన్ని. కాని, అటువంటి పని చెయ్యకూడదని చాక్లెట్లను తీసుకోడం మానుకునేదాన్ని. మా ఇద్దరిలో ఎవరివద్దనైనా డబ్బుంటే, అప్పుడు మాత్రం డబ్బు చెల్లించి, చాక్లెట్లను తీసుకొని తినేవాళ్ళం. తతిమ్మా సమయాలలో వాటికేసి ఆత్రుతగా చూస్తూ ఉండిపోయే వాళ్ళం.

కాని, అలా ఎక్కువ కాలం గడవలేదు. ఒకరోజు మా ఇద్దరికీ ఎంతో ఉత్సాహకరంగా ఉంది. ఆ రోజు మా ఇద్దరివద్దా డబ్బు లేదు. రంగు రంగుల వెండి కాగితాలలో చుట్టిన ఆ చాక్లెట్లను చూస్తూంటే, నా నోట్లో నీళ్ళు నమిలాను. ఓసారి కార్మె

పీటా వైపు చూశాను. ఆమె చెయ్యి పట్టుకొన్నాను. ఇద్దరం ఒక నిశ్చయానికి వచ్చాం. మరోక్షణంలో రెండు చాక్లెట్ పేకెట్లు తీసి, ఒకటి కార్మిపీటాకిచ్చి, రెండోది నేను తీసుకొని, ఇద్దరం తినడం ప్రారంభించాం.

మా షాపులో కొన్ని వందల చాక్లెట్ల పేకెట్లున్నాయి. ఒకటో, రెండో మేము తింటే, అది షిల్లర్‌కి ఎలా తెలుస్తుంది? అదే కాకుండా 30 రోజులపాటు చిల్లిగవ్వ కూడా తీసుకోకుండా నేనీ షాపులో ఉద్యోగం చేశానుగా? పాపం, కార్మిపీటా కూడా ప్రతి రోజూ కాలక్షేపానికి ఈ షాపుకి వస్తోంది. అటువంటప్పుడు కాసిన్ని చాక్లెట్లు తింటే, మరేమీ తప్పు లేదని మా ఇద్దరికీ అనిపించింది.

షిల్లర్ అదో విధమైన స్వభావం గలవాడు. షాపులో నన్ను ఒంటరిగా ఉండమనే వాడు. అతను లేనప్పుడు కార్మిపీటా షాపుకి వచ్చి, నాతో మాట్లాడుతోంది అనే విషయం అతనికి తెలిసి ఉంటే, నామీద తప్పకుండా కోప్పడేవాడు. కాని, ఆమె

వస్తున్న సంగతి అతనికి తెలియదు. ఒంట రిగా షాపులో ఉండటం అంటే నాకు భయంగా ఉండేది. కార్మిపీటా నాతో ఉంటే, నాకెంతో ధైర్యంగా ఉండేది. ఆ రోజులలో దేశమంతటా దొంగతనాలు ఎన్నో జరిగేవి. ఏ దొంగైనా మా షాపులో పడితే, మేము ఇద్దరం కలసి ఆ దొంగని ఎలాగో బోల్తా కొట్టించగలమనే నమ్మకం మాకుండేది. షాపులోకి వచ్చిన దొంగతో చమత్కా రంగా నేను మాట్లాడుతూంటే, నా సంజ్ఞను గుర్తించి, కార్మిపీటా సమీపంలో ఉన్న పోలీస్ స్టేషన్‌కు పరుగెత్తేదని నేను భావించే దాన్ని.

ప్రతిరోజూ షాపుకి కార్మిపీటా వచ్చేది. ఇద్దరం కులాసాగా కబుర్లు చెప్పుకునే వాళ్ళం. ధారాళంగా చాక్లెట్లు తింటూ ఉండేవాళ్ళం. వారం రోజులపాటు మేము చాక్లెట్లను తింటూనే ఉన్నాం. ఆ చాక్లెట్లకు చుట్టిన వెండి కాగితాల్ని ఎక్కడ పారెయ్యాలసి నదీ మాకొక సమస్యగా పరిణమించింది. షాపులో ఉన్న చెత్త కాగితాల బుట్టలో పడెయ్యడం మంచిది కాదు; ఎందువల్లంటే

మిసెస్ పిల్లర్ షాపులోకి రాగానే ఆ బుట్టలో ఉన్న తుక్కుని జాగ్రత్తగా పరిశీలిస్తూండేది. షాపు ముందున్న వీధిలోకి వాటిని విసరడం కూడా ప్రమాదకరమే అనిపించింది. షాపులోకి అడుగుపెట్టే ముందు పిల్లర్ ఓసారి షాపు ముందు భాగాన్ని వీధిలో నిలబడి, భద్రంగా పరకాయించి చూసి, అతను లోపలికి వస్తూండేవాడు. చివరికి ఒక ఆలోచన తట్టింది. ఆ వెండి కాగితాలన్నిటినీ పట్టుకెళ్లి, షాపు ముందర కిటికీపైనున్న ఒక సొరుగులో వాటిని పడేశాం. అవి ఎవరికి కనపడవని మేమిద్దరం ఎంతో సంతోషించాం.

కాని, ఒక్క శనివారం నాడు మా రహస్యం అంతా బయటపడింది. కిటికీలనీ, గోడలనీ శుభ్రపరచడానికి పిల్లర్ ఒక మనిషిని రప్పించాడు. ఆ మనిషి తన పని చేస్తూండగా, మేము అంతవరకూ రహస్యంగా దాచిన చాక్లెట్ కవర్లన్నీ అతనికి అగుపడ్డాయి. నిచ్చెనమీద నిల్చున్న ఆ మనిషి పిల్లర్ వైపు ఆశ్చర్యంగా చూస్తూ, ఇలా అరిచాడు :

లన్నిటినీ గుంపుగా చేత్తో నొక్కిపట్టుకొని, నేను ఇంటికి పరుగెత్తాను. తోవ పొడుగునా ఏడుస్తునే ఉన్నాను.

వంటింట్లో పనిచేస్తూన్న అమ్మ ముందుకి తిన్నగా వెళ్లాను. నా చేతిలో ఉన్న కాగితా లని అమ్మ ముందు పడేశాను. ఏదో చెపుతు న్నాను. కాని, ఏడుస్తూనే ఉన్నాను. నా బాధ ఏమిటో అమ్మకి అర్థం కాలేదు.

"కాత్రిన్, నువ్వు ఏడవడం మాని, ఏం జరిగిందో చెప్పు," అంది అమ్మ.

అమ్మ ఆ ప్రశ్న ఎంత ఆప్యాయంగా అడిగింది! ఆ క్షణంలో ఆ మొకంఠంలో ధ్వనించే ప్రేమని చూస్తూంటే, మరింత అధికంగా ఏడవవలసి వచ్చింది. అంత మంచి తల్లికి నాలాంటి పాపిష్టికూతురు ఎందుకు పుట్టిందో అనుకొన్నాను. షాపులో పనిచేస్తూ, ఇలా దొంగతనంగా చాక్లెట్లు తినడం మా కుటుం బానికే ఒక పెద్ద కళంకం. నేను దొంగని! ఏడుస్తున్నాను. అమ్మ మాట్లాడకుండా ఓ తువ్వాలు పట్టుకొచ్చింది. మెల్లిగా నా మొహం తుడిచింది.

"ఇంక ఏడవకు, కాత్రిన్," అంటూ నేను పెద్దదాన్నయినా నన్ను ప్రేమతో తన వొళ్ళో కూర్చోబెట్టుకొంది. మెల్లిగా జరిగిందంతా అమ్మకి చెప్పేశాను. చివరికి మిసెస్ పిల్లర్ తిట్లన్నీ కూడా అమ్మకి వల్లించాను. అమ్మ ఒకసారి నన్ను గట్టిగా కౌగిలించుకొంది.

అమ్మ ఏమంటుందో అని నేను ఆత్రుతగా వేచి ఉన్నాను. ఎప్పుడేనా పిల్లలు తప్పు చేస్తే, అమ్మ ఊరుకోలేదని నాకు తెలుసు. ఈసారి నేను చేసింది పెద్ద నేరం. ఈ నేరానికి అమ్మ ఏం శిక్ష విధిస్తుందో!

అమ్మ చటుక్కున లేచి నిలబడింది. అంతవరకూ ఆమె వొళ్ళో కూర్చున్న నేను క్రింద పడతానేమోనని భయపడ్డాను. నేల మీద కూర్చొని, ఆమె వైపే చూస్తున్నాను. మళ్ళా వెక్కి వెక్కి ఏడవ సాగాను. అమ్మ కొంచెం మంచినీళ్ళు తాగి, మళ్లా నా దగ్గరికి తిరిగి వచ్చింది.

"అమ్మా, నువ్వు నన్ను క్షమించాలి. అందరూ నేను దొంగనని నన్ను ఎత్తిపొడుస్తు

న్నారు. ఈ క్షణంలో కోప్పడకుండా నువ్వు నన్ను కాపాడాలి," అన్నాను.

నా వణుకుతున్న చెయ్యిని అమ్మ గట్టిగా పట్టుకొంది.

"కాట్రిన్, ఏడవకు. నువ్వు దొంగవి కావు. చాలా మంచిదానివి."

"ఆ చాక్లెట్లన్నీ నేను నిజంగా దొంగిలించే తిన్నానమ్మా."

"కాట్రిన్, నువ్వు దొంగవి కాదు," అమ్మ మళ్ళా అంది.

నేను దొంగని ఎలా కాదో, నాకు అర్థం కాలేదు. బుర్ర ఆడిస్తూ, అమ్మ వైపు చూశాను.

"నువ్వు తెలివి తక్కువ పని చేశావు. నీలా చిన్న వయస్సులో ఉన్న వాళ్ళకి చాక్లెట్లంటే ఎంతో ఆశగా ఉంటుంది. ఆ ఆశకి నువ్వు లొంగి పోయావు. అది దొంగ తనం కాదు, కాట్రిన్."

"అమ్మా, డబ్బియ్యకుండా అవి అన్నీ తినడం దొంగతనమేగా?"

అమ్మ జవాబియ్యలేదు. ఎందుకో విచిత్రంగా నవ్వసాగింది.

"ఎందుకమ్మా నవ్వుతున్నావు?"

"కాట్రిన్, నువ్వు నవ్వాలి. అనవసరంగా నీ హృదయంలో నువ్వు దొంగవని బాధ పడకు. ఏదో తప్పు చేశావు. నిజమే. తప్పుని సరిదిద్దుకొని, గర్వంగా తలెత్తి, మళ్ళా ప్రపంచంలో జీవించాలి, కాట్రిన్!"

నా బుర్ర వాల్చాను. అమ్మవైపు చూడలేక పోయాను.

"అమ్మా, నీ కూతురునై కూడా ఇటువంటి నేరం నేను ఎలాగ చేశానో నాకు బోధపడడం లేదు."

"కాట్రిన్, ఏదేనా తప్పు చెయ్యగానే బాధ పడడం మంచిదే. ఆ బాధ మూలంగా అటువంటి తప్పు మళ్లా చెయ్యం. కాని, తెలివి తక్కువగా తప్పులు చేసినట్టే వాటిని వివేకంగా మరచి పోయే లక్షణం కూడా మనలో ఉండాలి."

"అవునవును."

"కాట్రిన్, విను. నీకో చిన్న కథ చెప్తాను. నువ్వు చేసిన పనిని గురించి ఆలో

చిస్తూంటే, నా కేదో జ్ఞాపక మొస్తోంది. ఆ రోజుల్లో. నేను మీ జెన్నీ పిన్ని ఇంటిలో ఉండే దాన్ని. అప్పుడు నేను చిన్నదాన్ని. ప్రతి ఆదివారం మీ నాన్న ఆ ఇంటికి వస్తూండే వారు. చిన్నదాన్ని అవడంవల్ల ఆ రోజుల్లో నా దగ్గర డబ్బు ఉండేది కాదు.

"ఒకరోజు జెన్నీ ఒక పెద్ద రొట్టెను తయారు చేసి, దాన్ని బీరువాలో పైన ఎవ్వరికీ కనుపడకుండా పెట్టింది. జెన్నీ పిన్ని ఇంటిలో లేనప్పుడు ఆ రొట్టెను నేను చూస్తూండే దాన్ని."

నేను అమ్మ మొహంలోకే చూస్తున్నాను. ఆమె కళ్ళు మూసుకొంది. ఎప్పుడో జరిగిన ఈ సంఘటనని ఆమె జ్ఞప్తికి తెచ్చుకొంటోంది.

"ఆ రొట్టెను చూస్తూంటే, తినాలనిపించేది. కాని, జెన్నీ ఊరుకుంటుందా? కాని, నా వయస్సులో నా కోరికలను ఆపుకొనే శక్తి నాకు లేదు. ఒకచిన్న కత్తితో ఒక ముక్కను కోసి, తినేశాను. అటుపైన ఇంకా తినాలనిపించింది. జెన్నీ ఇంట్లో లేని సమయాల్లో ఆ

రొట్టెలోంచి చిన్న చిన్న ముక్కల్ని కోసుకొంటూ తింటానే ఉన్నాను."

అమ్మ నవ్వు గదిలో ప్రతిధ్వనించింది. అంతవరకూ ఏడుస్తున్న నా మొహం ఎందువల్లో ప్రకాశవంతంగా అయింది. అమ్మతో కలిసి నేనూ నవ్వాను.

"తర్వాత ఏమయిందమ్మా?"

"ఈనాడు నీ నేరం తెలిసినట్టే, ఆనాడు నేను చేసిన నేరం కూడా జెన్నీకి తెలిసింది. ఆ రోజు ఆదివారం. మీ నాన్న భోజనానికి వచ్చారు. జెన్నీ విచిత్రంగా ప్రవర్తించింది. నన్ను ఒక్క మాట కూడా అనలేదు. మేము భోజనానికి కూర్చున్న సమయంలో సగం పైగా తినివేయబడ్డ ఆ రొట్టెని తీసుకొచ్చి, టేబుల్ పైన పెట్టింది. మీ నాన్న నవ్వుతూ, ఆ రొట్టె వైపు చూశారు. ఆ రొట్టె ఎందుకలా ఉందని జెన్నీ నడిగారు. జెన్నీ నావైపు చూపెడుతూ, ఆ రొట్టె అలా ఎందుకుందో మీ నాన్నతో చెప్పింది."

"అప్పుడు నాన్న ఏం చేశారు?"

"నన్ను పెళ్ళాడారు," అంది అమ్మ చిరునవ్వుతో.

అమ్మ మీదకి వంగి, ఆమెని నా రెండు చేతుల్లోటీ గట్టిగా పట్టుకొన్నాను.

"కాట్రిన్, ఇదంతా విన్నాక ఇప్పుడు నువ్వు నవ్వగలవా? ఏదో నేరంచేస్తే, దాని మూలంగా ఈ లోకంలోంచి మనం పారిపోవడం అనవసరం."

నేను మాట్లాడకుండా ఉండి పోయాను.

"కాట్రిన్, నువ్వు దొంగవి కాదు. షాపులో చాక్లెట్లుతింటే, వాటికి డబ్బు కట్టాలి. అది మన మర్యాద," అంటూ అమ్మ మెల్లిగా గుమ్మంవైపు వెళ్లబోయింది.

ఓసారి ఆగి, నావైపు చూసింది.

"కాట్రిన్, ఆ ఉడుకుతున్న బంగాళా దుంపల్ని జాగ్రత్తగా చూడు. నేను పిల్లర్ షాపుకెళ్లి, ఇప్పుడే వస్తాను," అంటూ అమ్మ వడివడిగా బయటికి నడిచింది.

## 12

సాధారణంగా జెన్నీ పిన్నికి ఎక్కడ ఏం జరిగినా త్వరగా తెలుస్తూ ఉండేది. తనకి తెలిసిన విషయాన్ని తాజాగా పిన్ని అందరికీ చెప్పేది. ఈసారి మాత్రం జెన్నీ పిన్నికంటె ముందుగా ట్రీనా పిన్నికి ఏదో రహస్యం తెలిసింది. అదేమిటో ఆమె చెప్పేది కాదు. ఏదో చెప్పబోయి, చెప్పలేక ఆఖరికి విచారంతో, "పాపం, ఎల్మా పిన్ని..." అని ఊరుకొనేది.

ఆ సమయంలో పిన్నిలందరూ అమ్మతో సహా కాఫీ తాగుతూ, వంటింటిలో కూర్చుని ఉండేవారు. ఏదో పనిచేస్తున్నట్టు నటిస్తూ, వాళ్ళ మాటలు పూర్తిగా వినటంకోసం నేనక్కడే ఉండిపోయే దాన్ని. ట్రీనా సూచాయగా చెప్పిన మాటల్నిబట్టి ఆలోచిస్తే, మా పెద్దపిన్ని ఎల్మాకి ఏదో విషాకమైన ఆపద సంభవించి ఉంటుందని అనిపించింది. ఆమెకి నిజంగా ఏం జరిగిందో తెలుసుకోవాలని నాకెంతో కుతూహలంగా ఉండేది.

కాని, ట్రీనా పిన్నికి తను చెప్పదలచు కొన్నది పూర్తిగా చెప్పే అవకాశం చిక్కేది కాదు. జెస్సీ పిన్ని అడ్డు వస్తూండేది. ఒక సారి మార్తా పిన్ని ఏల్మాకేమైందని ట్రీనాని అడిగింది. ఈ సారి ట్రీనా తప్పకుండా జవాబిస్తుందని నేను వెనక్కి తిరిగి చూశాను. కాని, ట్రీనా నోరు తెరచే లోగానే జెస్సీ పిన్ని కంఠం ఎత్తి, పంచదార డబ్బాని తన ముందుకు తొయ్యమని గట్టిగా అరచింది. అటుపైన చమత్కారంగా ఏల్మా మీద నుంచి సంభాషణని మరో విషయం మీదకి పోనిచ్చింది.

జెస్సీ పిన్ని స్వభావమే అంత. ఏదైనా తనకి ఇష్టం లేకపోతే తన సమక్షంలో దాన్ని గురించి చర్చించడానికి ఆమె సమ్మతించదు. పిన్నీలందరికీ ఏల్మాని గురించి ఏదో చెప్పుకో వాలని ఉన్నప్పటికీ, జెస్సీ పిన్ని మూలంగా ఆమెను గురించి మాట్లాడుకొనే అవకాశం వాళ్ళకి లభించలేదు.

అప్పట్లో జెస్సీ పిన్నికి బాధలు ఎక్కువయ్యాయి. హైట్ వీధిలో ఆమె ఒక వసతి గృహాన్ని నడిపేది. ఎంతోమంది అక్కడ

గదులు అద్దెకు తీసుకొని, భోజనం చేస్తూ ఉండే వారు. ఆమె గదులన్నీ చాలా శుభ్రంగా ఉంచేది. కాని, ఎందువల్లో వసతిగృహంలో చేరినవాళ్లందరూ మెల్లమెల్లగా బయటికి వెళ్లిపోసాగారు. ఆమె అప్పుల్లో మునిగిపో యింది. దాని మూలంగా జెన్నీ పిన్నికి ప్రతి చిన్న విషయం మీదా తొందరగా కోపం వస్తూండేది.

నా మనస్సంతా ట్రీనా చెప్పని వార్త మీదే ఉంది. ఇంతకీ ఏల్నా అమ్మమ్మకి ఏమైంది? ఇదే ప్రశ్న నన్ను వేధించేది. ఏల్నా అప్పటికి చాలా ముసల్ది అయిపో యింది. అప్పటికి ఆమెకి బాగా చెముడు కూడా వచ్చింది. ఆమెని గురించి ఆలోచి స్తుంటే, పిల్లలు చదువుకొనే కథల పుస్తకా ల్లోంచి వెలువడిన ఏ పాత్రలాగో ఏల్నా నాకు అగుపడేది. ఒకసారి ఎప్పుడో ఆమెను చూశాను. సన్నగా, పొడుగ్గా ఉండేది. వెంట్రుకలన్నీ నెరిసి పోయాయి. కాని, మొహం చూస్తే మాత్రం ఆమెలోని పట్టు దల, దీక్ష స్పష్టంగా కనుపించేవి. మా కుటుం బంలోని వాళ్ళందరూ ఆమెని గురించి ఎన్నో

విచిత్రమైన కథలు చెప్పుతూండేవారు. ఒక సందర్భంలో ఏల్నా అమ్మమ్మ తనని మోస గించి పారిపోయిన ప్రియుడిని పగతో మృత్యు పాశాల్లోకి విసిరి, గుర్రం ఎక్కి స్వారీ చేస్తూ, నవ్వుతూ వెళ్లిపోయిందట.

ఎంతో శాంతిమయంగా నడిచే మా జీవి తాల్లో ఏల్నాను గురించి మేము విన్న కథలు మాలో దుమారాన్ని లేవదీసేవి. ఆమెను గురించి అనేకమంది చెప్పుకొనే ఈ కథ ఎన్నిసార్లో విన్నాను.

అప్పట్లో ఏల్నా పిన్ని చిన్నది. కొంచెం నల్లగా ఉండేది. ఆమెకి చిన్నప్పటినుంచీ ఎంతో ధైర్యం ఉండేది. వర్ణించలేని ఉత్సాహం ఆమెలోంచి పొంగుతూండేది.

ఆ సమయంలో ఏల్నాకి ఫేడర్ అనే యువకునితో పరిచయమయింది. ఇద్దరూ ప్రేమించుకొన్నారు. పెళ్లి కూడా నిశ్చయ మయింది. కాని, ఆ రోజుల్లో మా కుటుంబం లోని పెద్దవాళ్ళకి ఫేడర్ అంటే ఇష్టంగా ఉండేది కాదు. ఆ సంబంధం మంచిది కాదని పెద్దలంతా ఏల్నాతో చెప్పారు. కాని, వాళ్ల మాటల్ని ఏల్నా లెక్కచెయ్యలేదు. ఏల్నా

లాంటి యువతిని లొంగదీయడం ఆ రోజుల్లో ఎంతో కష్టసాధ్యంగా అవుపడింది. కుటుంబం లోని పెద్దవాళ్లు చెప్పిన మాటలు వినని ఏల్నా, తన ప్రియుడు చెప్పిన మాటమాత్రం వింటుందా? ఆమె ఫేడర్‌ని ఎంతో ప్రేమిం చింది. అయినా, వాళ్లిద్దరికి మధ్యమధ్య ఏవో దెబ్బలాటలు వస్తూండేవి. ఇద్దరూ తిట్టుకొనే వారు. పెళ్లి అయ్యే ముందే వాళ్ళిద్దరి మధ్యా ద్వేషాలు కూడా ఏర్పడ్డాయి. కాని, వాళ్ళ హృదయాల్లో ఒకప్పుడు ఇద్దరినీ దగ్గరగా చేర్చిన ప్రేమ ఇంకా అలాగే ఉంది.

ఏల్నాకీ, ఫేడర్‌కీ గుర్రాలంటే ఎంతో ఇష్టం. ఏల్నా గుర్రపుస్వారీ చాలా బాగా చేసేది. ఆ రోజుల్లో సాధారణంగా ఆడ వాళ్ళంతా ఇళ్ళల్లోనే కూర్చుని ఉండే వాళ్ళు. కాని, ఏల్నా ఇంట్లో కూర్చునే యువతి కాదు. ఫేడర్‌తో పోటీ పెట్టుకొని, అతనితో గుర్రపు స్వారీ చేసి, చివరికి అతన్ని ఆమె ఓడిస్తూ ఉండేది. అనేకమంది ఏల్నా ప్రవర్తనిచూసి, విస్తుపోయేవారు. చివరికి ఒక గుర్రంమీద సంభాషణ పెరిగి, వాళ్ళిద్దరికీ పెద్ద పోట్లాట వచ్చింది. ఫేడర్ 'థోర్' అనే

గుర్రాన్ని అప్పుడే కొని పట్టుకొచ్చాడు. ఆ గుర్రం మనుష్యుల్ని బాగా ఎదిరించేది. రెండు మూడు సార్లు అది ఫేడర్ నే క్రిందకి పడేసి, దాడు తీసింది. ఆ గుర్రందగ్గరకి పోవడమంటే చాలామందికి భయంగా ఉండేది. అటువంటి గుర్రాన్ని తనెక్కి స్వారీ చేస్తానని ఏల్నా పట్టుపట్టి కూర్చుండట. ఆమెకి ఏం హాని జరుగుతుందోనని భయపడి, ఫేడర్ వొద్దన్నాడట. మామూలుగానే ఏల్నాకి చెప్పలేనంత కోపం వచ్చింది. ఒకళ్ళ మాటని పట్టించుకొనే స్వభావం ఆమెకి లేదు. ఆ చిన్న విషయంమీద ఏల్నా ఆపుకోలేని కోపంతో అతనిమీదకి ఎగిరిపడింది. ఆమె ప్రవర్తనని చూస్తుంటే, అతనికి విసుగెత్తింది.

"ఈ అడవి గుర్రంలాగే, నువ్వూ కూడా ఓ అడవి మనిషివి, ఏల్నా," అన్నాడతను.

అలాగే మాటలూ మాటలూ పెరిగాయి. విచారంతో ఇద్దరూ విడిపోయారు.

ఫేడర్ వెంటనే ఆస్లో పట్నానికి వెళ్ళిపోయాడు. కొన్ని వారాల తర్వాత స్వగ్రామానికి తిరిగివచ్చాడు. ఈసారి అతని కూడా మరో స్త్రీని పెళ్ళాడి తీసుకొచ్చాడు.

ఏల్సాకి ఆ విషయం తెలిసింది. ఆ రోజుల్లో ఆమె తిండి తిన లేదు. ఒంటరిగా ఇంటి బయట ఇటూ, అటూ తిరుగుతూ ఉంది. ఇంట్లో వాళ్ళెవరైనా దగ్గరగా వెడితే, వాళ్లని కసరి పొమ్మంది. చివరికి ఏల్సా ఒక నిశ్చయానికి వచ్చింది.

"ఒకసారి ఫేడర్ ఇంటికి వెళ్లివస్తాను. అతనికి నా ఆనందాన్ని తెలియజేసిరావాలి," అందామె ఇంటివాళ్ళతో.

తల్లి, తండ్రీ ఆమెని ఆపడానికి ఎంతో ప్రయత్నించారు. అక్కచెల్లెళ్ళందరూ వెళ్లొద్దని ఏడ్చారు. కాని, వాళ్ళు చెప్పింది వినకుండా ఇంతకు ముందు ఫేడర్ తనకిచ్చిన బహుమతులన్నిటినీ తన గౌను జేబులో పెట్టుకొని, ఏల్సా తన చిన్న గుర్రాన్ని ఎక్కి, ఫేడర్ ఇంటికి స్వారీ చేస్తూ వెళ్ళింది.

ఫేడర్ తన కొత్త భార్యతో సహా ఆ రోజే ఊళ్ళోకి వచ్చాడు. అనేకమంది స్నేహితులు ఆ సమయంలో ఫేడర్ ఇంట్లో ఉన్నారు. ఫేడర్ ఇంటి ముందు గుమ్మం దిగి, ఆమె తిన్నగా అతనున్న గదిలోకి వెళ్ళింది. గదిలో ఉన్న వాళ్లందరి కళ్ళూ ఏల్సా వైపు

తిరిగాయి. ఫేడర్ నిశ్చేష్టుడై నిలబడ్డాడు. ఇంతకు ముందు అతను ఇచ్చిన బహుమతు లన్నిటినీ ఏల్నా అతనికి అందించింది.

"నీ పెళ్ళి సందర్భంలో ఇవన్నీ నీకు బహు మతిగా ఇస్తున్నాను," అందామె అతని భార్యతో.

ఫేడర్ కోపంతో లేచాడు. హృదయాలు కలియక ఇద్దరూ విడిపోయిన తర్వాత ఆమె ఈ విధంగా ప్రవర్తించడం అసభ్యమని గట్టిగా చెప్పాడు. బహుమతుల్ని ముట్టుకో వద్దని తన భార్యతో అన్నాడు.

ఫేడర్ భార్య ఏల్నా ఇచ్చిన బహుమ తుల్ని నేలమీద విసరికొడుతూ ఇలా అంది: "నాకీ జీవితంలో బహుమతులు అనవసరం. నా కన్నిటికంటే విలువయిన బహుమతి ఫేడర్ నా భర్త అవడమే. అంతకంటే నా కింకేమీ అక్కర లేదు."

కొంతసేపటివరకూ ఏల్నా ఫేడర్ వైపు చూస్తూ ఉండిపోయింది. చటుక్కున ఒక విధ మైన విషపునవ్వు ఆమె పెదవులమీద విజృం భించింది.

"అయితే, ఫేడర్ నీవాడయ్యాడా?" అం దామె పరిహాసంగా అతని భార్యతో.

జవాబును కూడా ఎదురు చూడకుండా ఏల్నా హఠాత్తుగా వెనక్కి తిరిగి, మర్యాదగా ఇంట్లోంచి బయటికి వచ్చేసింది. అంత వరకూ ఏల్నా మూలంగా ఏ తుఫానో చెల రేగుతుందని కలలు గంటున్న అతిథులందరూ ఈ విధంగా ఆమె వెళ్లిపోవడం చూసి, నిర్ఘాంత పోయారు. ఆమె వెళ్ళిపోయిన కొంతసేపటి వరకూ ఆ గదిని నిశ్శబ్దం పరిపాలించింది.

బయటినుంచి వేగంగా పరుగెడుతున్న ఒక గుర్రం కాళ్ల చప్పుడు ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ వాళ్ళకి వినపడింది. ఆ చప్పుడు విన గానే ఫేడర్ బయటికి పరుగెత్తాడు. అతని వెనకనే అతిథులందరూ కూడా వెళ్లారు. ఏల్నా అతని గుర్రంమీద స్వారీ చేస్తూ, వేగంగా వెళ్ళిపోతోంది. ఇంతకు ముందు ఎప్పుడో ఆమె చెప్పినట్టే అతనికి చెందిన థోర్ గుర్రంమీదే ఆమె దౌడు తీసింది.

ఫేడర్ ఒకసారి గట్టిగా కేకేశాడు. ఓ సారి వెనక్కి చూసి, ఆమె గట్టిగా నవ్వింది.

వెంటనే ఫ్రేడర్ తన ఇంటి ముందు ఆమె వదలివెళ్ళిన గుర్రాన్ని ఎక్కాడు. వేగంగా ఆమెని అనుసరించాడు.

ఏల్నా, థోర్ గుర్రంమీద శరవేగంగా వెళ్ళిపోతూంది. ఆమెను పట్టుకోడానికి ఫేడర్ అష్టకష్టాలూ పడుతున్నాడు. తను స్వారీ చేస్తున్న గుర్రం మంచిది కాదు. అయినప్పటికీ వీలయినంత వేగంగా ఆ గుర్రాన్ని అతను పోనిస్తున్నాడు. అతని ముందు పోతున్న ఏల్నా వెనక్కి తిరిగి, పిచ్చిదానిలా అతన్ని వెక్కిరిస్తోంది; నవ్వుతోంది. ఆగమని అతను కేకలేస్తున్నాడు. అతని గుర్రాన్ని ఇంకా వేగంగా పోనిచ్చాడు. కాని, అదే క్షణంలో అతని గుర్రం కాలు విరిగి, నేలమీద కూలింది. అతను అమాంతంగా రోడ్డు ప్రక్కనున్న రాళ్లమీద పడ్డాడు. మరుక్షణంలోనే మరణించాడు.

ఈసారి వెనక్కి తిరిగి నవ్వుతూన్న ఏల్నా కళ్ళకి నేలమీద పడి ఉన్న ఫేడర్ అగుపడ్డాడు. ఆమె తన గుర్రాన్ని ఆపింది. ఫేడర్ పడున్న స్థలానికి వెళ్ళింది. అతని శరీరాన్ని ఎత్తి, అతని గుర్రంమీద వేసింది. ఓ గుర్రం

మీద స్వారీ చేస్తూ, రెండోగుర్రాన్ని పక్కనే పట్టుకొని, ఆమె మళ్లా ఫేడర్ ఇంటివైపు వెళ్ళింది. ఫేడర్ భార్య ఇంటి ముందుకు పరుగెడుతూ వచ్చింది.

"ఫేడర్ ఇప్పుడు నిజంగా నీవాడే!" అని ఏల్నా వికృతంగా నవ్విందట.

పైన చెప్పిన కథంతా మా పిన్నిలు చెప్పుకొంటూంటే విన్నదే. అటుపైన ఏల్నాని అమెరికా పంపివేశారు. అమెరికాలో ఆమె ఏదో ఉద్యోగం చేస్తూ ఉండేది. చిన్నతనంలో జరిగిన ఇటువంటి విచిత్ర సంఘటనలు మరేమీ ఆమెకి అమెరికాలో సంభవించలేదనుకొంటాను. మేము విన్న ఈ కథల మూలంగా ఏల్నా అమ్మమ్మ అంటే ఏదో శక్తిస్వరూపంలాగ మాకు అగుపడేది.

వంటింట్లోని పిన్నిలందరూ కాఫీ తాగడం ముగించారు. జెన్నీ పిన్ని ఏదో పనుందని లేచి, వెళ్లిపోయింది. నాలో నేను సంతోషించాను. ఇటుపైన ఎటువంటి ఆటంకమూ లేకుండా ట్రీనా తను చెప్పదలచుకొన్నది చెప్పుతుందని ఆశించాను. చివరికి ఆమె చెప్పింది.

ఏల్నా అమ్మమ్మని, పాపం, పేదవాళ్ళుండే గృహానికి ప్రభుత్వం పంపించబోతూందట. ఆమె చెప్పింది వినగానే అమ్మ ఎంతో విచారించింది. కొంతసేపటివరకూ ఏల్నాని గురించే మాట్లాడుకోవడం జరిగింది.

"ఏల్నా దగ్గర ఎంతో కొంత డబ్బుందిగా? పేదవాళ్ల గృహానికి ఆమెని ఎందుకు పంపడం?" అమ్మ అడిగింది.

"ఏం డబ్బుంది? గడించినదంతా ఎప్పుడో ఖర్చయిపోయింది. పాపం, ఆమెకి చెముడు కూడానూ," అంది ట్రీనా పిన్ని.

"ఏల్నా మన కుటుంబానికి చెందినది. ఆమె పేదవాళ్ళ గృహానికి వెళ్లకూడదు. మనం ఏదో చెయ్యాలి," అంది అమ్మ ఉద్రేకంతో.

పిన్నీలందరూ ఏదో సహాయం చెయ్యాలని వప్పుకొన్నారు. ఎలా సహాయం చెయ్యవలసినదీ ఆలోచించసాగారు. ఎవరింట్లోనో ఆమెకి ఆశ్రయమిస్తే బాగుంటుందని అనుకొన్నారు. కాని, ఎక్కడికో వచ్చి ఉండమంటే, ఏల్నా ఉంటుందా? ఆమె చాలా గర్వంగా బ్రతికిన మనిషి.

పిన్నిల సంభాషణ వింటూంటే, నా కిప్పుడు పూర్తిగా ఇష్టంపోయింది. వల్నా అమ్మమ్మ అమెరికాలో ఏదో ఘనకార్యం చేసింవని నేను అనుకొన్నాను. అందుకే త్రీనా ఏం చెబుతుందో వినాలనిపించింది. మెల్లగా వంటింట్లోంచి బయటికి జారి పోయాను.

ఆ రోజు శనివారం. అమ్మ తన పరుపు మీద పడుకొని ఉంది. ఎందుకు పడుకుందా అని అనుకున్నాను.

"కాట్రిన్, నువ్వు వంటింట్లోకి వెళ్లి, ఫలహారం తిను. తర్వాత దాగ్మర్‌ని కాస్సేపు బయటికి తీసుకెళ్ళు. ఇద్దరూ కాస్సేపు అలా తిరిగి ఆడుకు రండి," అంది అమ్మ.

అమ్మ అలా ఎందుకు చెబుతూందో నాకు తెలియదు. నేను అడిగేలోగా అమ్మే ఇలా చెప్పింది: "ఈవేళ మనింటికి వల్నా వస్తూంది."

దాగ్‌మర్‌రూ, నేనూ ఇంటికి ముందే నిల బడ్డాం. చివరికి ఏల్సా అమ్మనన్ను రావడం కళ్ళారా చూశాం. ఆమె వెనకనే మేము కూడా ఇంట్లోకి వెళ్ళాం.

ఏల్సా ఓసారి అమ్మనైపు చూసి, "అయితే, మళ్ళా గర్భంతో ఉన్నావన్న మాట?" అంది.

అమ్మ జవాబివ్వ్యలేదు. సిగ్గుపడుతూ ఊరుకొంది.

"అయిదుగురు పిల్లలకంటే ఏ కుటుంబా నికీ ఎక్కువ ఉండకూడదు," అని శాసిస్తూ, ఏల్సా కుర్చీలో కూలబడింది.

"అయితే, నువ్వు నన్ను నీ ఇంటిలోనే ఉండమంటావా?" ఏల్సా అడిగింది.

అమ్మ "ఊఁ, అన్నట్లు బుర్ర ఆడించింది. "ఈ సమయంలో నీ ఇంటికి నన్ను ఆహ్వా నించినందుకు ఎంతో సంతోషిస్తున్నాను.

కాని, క్షమించు. పేదవాళ్ళ గృహానికే వెళ్ళి ఉందామని నాకు కుతూహలంగా ఉంది."

"అలా ఎప్పుడూ జరగదు. మేమందరం బ్రతికి ఉండగా నిన్ను పేదవాళ్ళ గృహానికి వెళ్లనివ్వం," అంది అమ్మ.

"నీ ఇంటిలో ఉండి మాత్రం నేనేం చేస్తాను? నీకప్పుడే ఇద్దరు పిల్లలు ఎదిగి, చేతి కందొచ్చారు. ఇక్కడ ఉండి మీ కేదో బరువు అవడం నాకిష్టం లేదు."

ఎంత అడిగినా ససేమిరా ఏల్నా అమ్మమ్మ మా ఇంటిలో ఉండడానికి ఒప్పు కోలేదు. అమ్మ కొంచెంసేపు ఆలోచించి, ఏల్నా అమ్మమ్మతో ఇలా అంది: "అయితే, నువ్వు ఎవరింటిలోనూ ఉండొద్దు. నీకొక ఉద్యోగం ఇప్పిస్తాను. అది చేసుకొంటూ జీవించు."

"ఉద్యోగమా! డెబ్భై ఏళ్ళు దాటిన ముసలిదానికి ఈ ప్రపంచంలో ఉద్యోగం ఎవరిస్తారు? ఈ లోకంలో నాకింక జీవించాలని లేదు."

"అదంతా నీకెందుకు? నేను ఉద్యోగం ఇప్పిస్తే చేస్తావా?"

"తప్పకుండా చేస్తాను."

ఆ రోజు మా ఇంటిలోని వంట ఏల్సా అమ్మమ్మ చేసింది. ఏల్సా వంట ఎంతో బాగా చేస్తుంది. ఆమె వంట చేస్తున్న సమయంలో జెన్నీ పిన్ని వంటింటిలోకి వచ్చింది. చిన్నప్పటినుంచీ జెన్నీ పిన్నికి ఏల్సా అంటే ఇష్టం లేదు. ఏల్సాని వంటింటిలో చూడగానే బయటకి పోదామనుకుంటూ, జెన్నీ పిన్ని రెండడుగులు వెనక్కి వేసింది.

"జెన్నీ, వెళ్ళిపోకు. ఇలా రా," అంది అమ్మ.

జెన్నీ మారు మాట్లాడకుండా అమ్మ పక్కనే వచ్చి, కూర్చుంది. అమ్మ ఏల్నాని కూడా దగ్గరగా రమ్మని పిల్చింది. ఏల్నా కూడా వచ్చి కూర్చుంది. అమ్మ మూడు కప్పుల కాఫీ తయారుచేసి, టేబుల్ మీద పెట్టింది. ముగ్గురూ కాఫీ తాగడం ప్రారంభించారు.

"మనం ముగ్గురం ఒక్క కుటుంబానికి చెందిన వాళ్ళం. అది మనం మర్చిపోకూడదు," అంది అమ్మ.

"అయితే అయి ఉండొచ్చు. కాని, మీవద్దనుంచి నా కెటువంటి సహాయమూ అక్కర లేదు," అంది ఏల్నా సగర్వంగా.

"మా సహాయం నీ కక్కర లేదు. కాని, మాలో ఒకళ్ళకి నీ సహాయం కావాలి, ఏల్నా!"

ఏల్నా ఆశ్చర్యపోతూ, అమ్మ వైపు చూసింది.

"జెన్నీ ఎలా ఉందో చూడు. ఆమె భర్త ఎప్పుడో పోయాడు. ఉన్న డబ్బంతా పోసి, ఆమె ఓ పెద్ద వసతిగృహాన్ని నడపడం మొదలుపెట్టింది. అందులో చేరిన వాళ్ళం దరూ మెల్లిగా బయటకు వెళ్ళిపోతున్నారు. జెన్నీ అప్పులపాలయింది. ఈ నాడు ఆమె వసతిగృహంలో చేరిన వాళ్ళు, రేపు వెళ్ళి పోవడానికి కారణం? ఆమె గదులన్నిటినీ చాలా శుభ్రంగా ఉంచుతుంది. అయినా జెన్నీకి వంట తెలియదు. ఆమె వండిన వంటని తినలేక వాళ్ళందరూ వెళ్ళిపోతు న్నారు," అంది అమ్మ.

అంత ధైర్యంగా జెన్నీ పిన్నికి వంట తెలియదని అమ్మ అనడం విని, నేను ఆశ్చర్యపోయాను. జెన్నీమీదకే నా చూపు వెళ్ళింది.

"నాకూ ఎంతో కొంత వంట తెలుసులే! నా వంట బాగుగా లేకపోవడంవల్ల వాళ్ళు వెళ్ళిపోవడం లేదు," అంది జెన్నీ.

"జెన్నీ! మన తప్పులు మనం గుర్తించు కోవడం మంచిది. బయటి వాళ్ళ ముందు మన లోపాల్ని చూపించడం అనవసరం. నువ్వెంత చెప్పినా నీకు వంట తెలియదు. ఇరవై ముగ్గురు నీ వసతిగృహంలో చేరారు. ఇప్పుడెంతమంది ఉన్నారు?"

"అయిదుగురున్నారు."

"నీ మంచి కోరి ఓ సలహా ఇస్తున్నాను. ఎల్నా పిన్నిని తీసుకు వెళ్ళి, నీ వసతిగృహంలో ఉంచు. ఆమెని వంటలో ఆరితేరిన చెయ్యి. అందువల్ల నీ వసతిగృహంలో చేరిన వాళ్ళు ఇక వెళ్ళిపోవడం అనేది సంభవించదు."

"నీకు పిచ్చి పట్టినట్టుంది. ఎల్నాకీ, నాకూ ఎప్పుడూ పడదని నీకు తెలుసుగా? ఇద్దరం ఒకే ఇంటిలో ఉండడం ఎలా?" అంది జెన్నీ పిన్ని.

"జెన్నీతో ఉండడంకంటె, పేదవాళ్ళ గృహానికే పోవడం మంచిది," అంది ఎల్నా.

"అయితే, అక్కడికే వెళ్ళి ఉండు," అంది జెన్నీ కోపంగా.

"ఇలా మీరిద్దరూ పోట్లాడుకుంటే లాభం లేదు. ఎప్పుడో ఉన్న ద్వేషాలు మనం హృదయాల్లో శాశ్వతంగా ఉంచుకోవడం మంచిది కాదు. మీ ఇద్దరికీ పడకపోతే, మాట్లాడుకోకండి. ఏల్మా ఎప్పుడూ వంటింటి లోనే ఉంటుంది. ఆమె పని వంట చెయ్యడమే. ఆమె వండిందంతా నీ వసతిగృహంలో ఉండే వాళ్ళకి నువ్వు వడ్డించు."

ఏల్మా, జెన్నీ పిన్నీ కొన్ని నిముషాల పాటు ఆలోచిస్తూ ఉండిపోయారు.

"నేను చెప్పినట్టు నువ్వు చేస్తే, ఏల్మా పేదవాళ్ళ గృహానికి వెళ్ళక్కరలేదు. అదే కాకుండా ఆమెవల్ల నీ వసతిగృహం జయప్రదంగా సాగుతుంది. ఎక్కువమంది వచ్చి చేరుతారు. నీ అప్పులు తీరిపోతాయి. లాభాలు తప్పకుండా వస్తాయి."

జెన్నీ పిన్ని ఏల్నా వైపు సూటిగా చూసింది. అమ్మ మాత్రం మౌనంగా కాఫీ తాగుతోంది.

'నువ్వు చెప్పింది బాగానే ఉంది," అంది జెన్నీ.

"వంట చెయ్యడం మాత్రం నాకు వది లితే ఎంతో బాగుంటుంది," అంది ఏల్నా.

"ఏది ఎలాగున్నా ఏల్నా ఎంతో బాగా వంట చేస్తుంది," అంది జెన్నీ కొంచెం ఆప్యాయంగా.

"నువ్వు కూడా ఎంతో కష్టపడి పని చేస్తావు," అంది ఏల్నా జెన్నీతో.

కొన్ని క్షణాలలో సంవత్సరాల తరబడి వాళ్ళిద్దరి మధ్యా ఉన్న శతృత్వం విచిత్రంగా అంతరించింది. ఇప్పుడు ఇద్దరూ ఒకరి నొకరు చూసుకొని. నవ్వుకొంటున్నారు.

"ఏల్నా, నీకు నేను జీతం కూడా ఇస్తాను," అంది జెన్నీ.

"ముసలిదాన్ని. నాకు జీతం ఎందుకు? వంటే కాదు, వడ్డించడం కూడా నేనే చేస్తానులే!"

అమ్మ సంతోషంగా నవ్వుతూ, ఇద్దరి చేతుల్నీ పట్టుకొంది.

"ఈ రోజు నాకెంతో ఆనందంగా ఉంది. జెన్నీ, నువ్వు ఇంటికి వెళ్ళి, వంటిల్లంతా శుభ్రం చెయ్యి. ఆయన గానడంతోటే ఏల్నాని మీ ఇంటికి పంపిస్తాను," అంది అమ్మ.

"అదేమిటి, అలా అంటావు? ఏల్నా ఆయనతో రావాలా? అదంతా అనవసరం. నేనూ, ఏల్నా కలసి ఇప్పుడే మా ఇంటికి వెళ్తాం," అంది జెన్నీ లేచి నిలబడుతూ.

కాస్సేపట్లో వాళ్ళిద్దరూ నవ్వుకుంటూ, సంతోషంగా బయటికి వెళ్లారు. రోడ్డుమీద వడుస్తున్న వాళ్ళిద్దరినీ చూస్తుంటే, అమ్మ

కళ్ళు ఆనందంతో ప్రకాశించాయి. అమ్మ దగ్గరే నేను నిలబడ్డాడు. అమ్మ నాట్యం చేస్తుందేమోనని నేను అనుకొన్నాను. ఒక్క సారి అమ్మ వెనక్కి తిరిగి, నన్ను తన కౌగిలిలో గట్టిగా బిగించింది.

# 13

వరా ఇంటి ప్రక్కనుండే మిసెస్ కార్ల్సో,

దాగ్‌మర్‌కి ఒక చిన్న పిల్లిని బహుమతిగా ఇచ్చింది. అది చాలా అల్లరి పిల్లి. ఒక్కొక్క సారి మనుష్యుల్ని చూడగానే హూంకారం చేస్తూ, మీద పడుతూండేది.

కాని, దాగ్‌మర్‌కి మాత్రం ఆ పిల్లి అంటే ఎంతో ఇష్టంగా ఉండేది. ఆ పిల్లి రావడంతోటే అంతవరకూ తను ఆడుకొంటూన్న బొమ్మల్నీ, పేకముక్కల్నీ దాగ్‌మర్ పూర్తిగా మర్చిపోయింది. ఆ పిల్లిని 'ఎలిజెబెత్' అని దాగ్‌మర్ పిలుస్తూ ఉండేది. తను ఎక్కడికి వెళ్ళినా, ఎలిజెబెత్‌ని కూడా మోసుకు వెళ్తూండేది. ఎన్నోసార్లు ఆ పిల్లి దాగ్‌మర్‌ని కూడా ఎదురించేది. ఎక్కడికైనా తీసుకు వెళ్తుతూంటే, దాగ్‌మర్ చేతుల్లోంచి ఆ పిల్లి కిందికి ఉరికేది. పరుగెత్తేది. చివరికి అష్ట కష్టాలూ పడి పిల్లిని మళ్లా

ఎలాగో పట్టుకొని, దాగ్‌మర్ దాన్ని తీసుకు వెళ్లేది. పిల్లి గోళ్ళతో రక్కి వేసిన గుర్తులు దాగ్‌మర్ చేతులు మీద మాకు అగుపడు తూండేవి. అవి చూస్తూంటే, నాకూ, క్రిస్టినీకి కొంచెం భయం వేసేది. మా భయాన్ని గురించి అమ్మతో కూడా చెప్పాం.

"అమ్మా, ఆ పిల్లిని దాగ్‌మర్ తనదగ్గరే పడుకోబెట్టుకొంటుంది. ఎప్పుడో ఒకప్పుడు అది దాగ్‌మర్ కళ్ళని పీకివేస్తుంది," అన్నాను నేను అమ్మతో

అక్కడే ఉన్న దాగ్‌మర్ నావైపు ఆశ్చర్యంగా చూసింది.

"నిజంగానా? నన్నడిగితే వాళ్ళిద్దరినీ వెంటనే వేరు చెయ్యమంటాను. పిల్లీ, పిల్లా ఒకే పక్కలో పడుకోకూడదని ఒక నార్వే సామెత ఉంది. మనం ఆపకపోతే, ఏదో ప్రమాదం సంభవిస్తుంది," అంది జెన్నీ పిన్ని.

కాని, దాగ్మర్ మొండిగా ఇలా జవాబిచ్చింది:" నాకేం ఫరవా లేదు. నా ఎలిజెబెత్ అప్పుడప్పుడు నాతో దెబ్బలాడినా, దానివల్ల నాకే ప్రమాదమూ రాదు," అని, ఆ గదిలో తిరుగుతూన్న ఎలిజెబెత్‌ని చేతుల్లో ఎత్తుకొని, దాగ్మర్ అందరివైపూ పరిహాసంగా చూసింది.

"అమ్మాయ్, ఈ వెధవ పిల్లికి 'ఎలిజెబెత్' అనే పేరు ఇవ్వడం అన్యాయం. అది మార్చడం మంచిదనుకుంటా," అంది క్రిస్టిన్.

ఆ మాటలు వినగానే దాగ్మర్‌కి చెప్పలేనంత కోపం వచ్చింది. తన పిల్లిని చేత్తో పట్టుకొని ఏడుస్తూ, అమ్మ దగ్గరికి పరుగెత్తింది.

"అమ్మా, నా పిల్లి పేరు ఎలిజెబెత్. ఆ పేరు మార్చవద్దమ్మా. మీ ముందు చూపించక పోయినా ఎలిజెబెత్‌కి నేనంటే ఎంతో ప్రేమ. ఎలిజెబెత్ ఎంతో మంచి పేరు.

దానికి పుట్టే పిల్లలందరికీ కూడా ఎలిజెబెత్ పేరే ఇస్తానన్నా."

రోజులు గడిచిన కొద్దీ ఎలిజెబెత్ పెరిగి పెద్దదయింది. పెద్దదవటంతోటే పిల్లికి క్రోధం కూడా ఎక్కువయింది. ఆ పిల్లి ప్రవర్తన చూస్తూంటే, దానిని పెంచడం అసాధ్యమేమో అనిపించేది. అది పెంపుడు పిల్లి కాదు; ఏ అడవిలోనో పుట్టి పెరిగిన గండుపిల్లిలా ప్రవర్తించేది. మా ఇంటి ప్రక్కనున్న ఇళ్ళకి దొంగతనంగా వెళ్లి, ఏవో చెడ్డపనులు చేసి, తిరిగొస్తూండేది. అందువల్ల మాకూ, ఇరుగు పొరుగు వాళ్ళకీ పోట్లాటలు కూడా వస్తూండేవి.

అంత ఘోరంగా ప్రవర్తించే పిల్లిని చూస్తుంటే, మా అందరికీ మామయ్య 'క్రిస్' జ్ఞాపకం వచ్చేవాడు. అందువల్ల ఆ పిల్లి పేరుకి 'మామయ్య' అనే పదాన్ని మేము తగిలించాం. అప్పటినుంచీ 'ఎలిజె

బెత్ మామయ్యా' అని ఆ పిల్లిని దాగ్‌మర్ తప్ప తతిమ్మా అందరం పిలుస్తూ ఉండే వాళ్ళం.

రాత్రిళ్ళు ఎలిజెబెత్ మామయ్య ఎక్కడికో వెళ్ళి, ఏదో యుద్ధం చేసి తిరిగివస్తూండే వాడు. ఒకరోజు ప్రొద్దుటే మేము చూసే సరికి అతని కుడిచెవి పూర్తిగా మాయ మయింది. అక్కడ రక్తం మాత్రం కారు తోంది. అదే కాకుండా ఎడం కన్ను బాగా వాచింది. త్వరలోనే ఏదో ఓ కన్ను పూర్తిగా పోతుందని మేమంతరం ఆశించాం.

ఎలిజెబెత్ మామయ్యని చూడగానే అమ్మకి కొంచెం కోపం వచ్చింది. కాని, దాగ్‌మర్ ఉత్సాహంగా ఎలిజెబెత్ మామయ్యని స్నానాల గదిలోకి తీసుకెళ్ళి, ఆ గాయాలన్నీ వేడినీళ్ళతో కడిగి, వాటికి 'బోరిక్ ఆసిడ్' మందు వేసింది.

ఒకరోజు ప్రొద్దుటే మళ్ళా మేము చూసే సరికి ఎలిజెబెత్ మామయ్య ముందున్న

గదిలో నిస్సహాయంగా నేలమీద పడు న్నాడు. మేము వెళ్ళగానే లేచాడు. కుంటు తున్నాడు. ఒక కాలు సగం పైగా తెగి పోయింది. బుర్రమీద ఏదో పెద్ద గడ్డ లేచింది. రెండు కళ్ళూ కూడా విపరీతంగా వాచి పోయాయి. తోక చివరి భాగం కత్తిరించివేయబడింది.

మమ్మల్ని అందరినీ చూడగానే 'మామయ్యా' దీనంగా అరుస్తూ, మా వైపు చూశాడు. ఈ ఆపదలోంచి కోలుకుంటే, ఇటువైపైన ఏ యుద్ధాలలోనూ పాల్గొనకుండా ఎలిజెబెత్ మామయ్య మా ఇంట్లోనే కుక్కిన పేనులా పడి ఉంటాడని అతని ఏడుపునుబట్టి నేనూహించాను. మళ్ళా దాగ్మర్ పిల్లికి ఎంతో సేవ చేసింది. కాని, లాభం లేకపోయింది. ఆ రోజులలో గది మూల బాధపడుతూ పడి ఉన్న ఎలిజెబెత్ మామయ్యాని చూస్తూంటే, మాకెందుకో భయం వేసేది; ఒకవైపున జాలి పుట్టేది.

ఇక డాగ్‌మర్ విచారాన్ని వర్ణించలేము. ఎప్పుడూ ఏడుస్తూండేది. ఎప్పుడో గుండె ఆగిపోయి చనిపోతుందేమో అన్న భయం మమ్మల్ని వేధించేది. డాగ్‌మర్ బాధ చూడలేక పిల్లలందరం దాచుకొన్న 50 సెంట్లు దానికి అందించాం.

"ఎలిజెబెత్ మామయ్యని ఇలా వదిలేస్తే లాభం లేదు. మనింటికెదురుగా ఓ పశువుల ఆస్పత్రి ఉంది. అక్కడికి తీసుకెళ్లితే, వెటర్నరీ డాక్టర్ ఏదైనా మందివ్వవచ్చు," అన్నాను నేను.

"అంతే కాదు; ఎలిజెబెత్ మామయ్య ఎంతో బాధపడుతున్నాడు. అతన్ని బ్రతికించ లేకపోతే, ఏదో మందిచ్చి, అతనికి శాశ్వతంగా బాధ లేకుండా చూడడం మంచిది," అంది క్రిస్టినీ.

పెదవులు విరుస్తూ, డాగ్‌మర్ మేమిచ్చిన డబ్బుని తీసుకొంది. సమీపంలో ఉన్న

వెటర్నరీ ఆస్పిటల్‌కి నెల్సన్‌తో కూడా వెళ్లింది. గంట సేపటిలో తిరిగి వచ్చింది.

"పిచ్చి డాక్టరు. నా పిల్లిని ఎవరూ బ్రతికించలేరుట," అంది దాగ్‌మర్

అప్పటికప్పుడే ఏడు రోజుల్నించి మా ఇంట్లో సంభాషణ అంతా ఎలిజెబెత్ మామయ్యని గురించే సాగేది. ఇదంతా చూస్తూంటే, అమ్మకి విసుగొత్తింది. దాగ్‌మర్ చేతులలో ఉన్న పిల్లిని అమ్మ తీసుకొంది.

"చివరికి మనింట్లో వాళ్ళందరూ ఈ పిల్లిని గురించే ఆలోచిస్తున్నారు. ఇక శాశ్వతంగా ఇది నిద్రపోయే సమయం వచ్చిందనుకొంటాను," అంది అమ్మ.

దాగ్‌మర్ ఏడ్వసాగింది.

"దాగ్‌మర్, ఏడిస్తే లాభం లేదు; నీ పిల్లి ఎంతో బాధపడుతోంది."

"అమ్మా, ఆ పిల్లిని రక్షించు. అది బ్రతికేటట్లు చూడు. అదంతా ఎలా చెయ్యాలో నీకు బాగా తెలుసమ్మా." అంది డాగ్మర్.

అమాంతంగా తన పెంపుడు పిల్లికి ప్రాణ భిక్ష అపేక్షించే డాగ్మర్ మొహాన్ని చూడలేక అమ్మ వెనుక భాగంలో ఉన్న వసారాలోకి వెళ్లింది. ఒక చిన్న పెట్టెలో ఆ పిల్లిని పడుకోబెట్టింది. అమ్మ వెనుకనే డాగ్మర్ కూడా పరుగెత్తింది.

"నీ చేతులు కడుక్కొని రా, డాగ్మర్." అంది అమ్మ.

" నా పిల్లిని బ్రతికిస్తావా? మళ్ళా బాగా ఉండేట్లు చూస్తావా?" డాగ్మర్ అడిగింది.

"డాక్టరు చెయ్యలేని పని నాకు సాధ్యం అవుతుందా?"

"అదంతా నాకు తెలియదమ్మా. ఇంతకు ముందు నువ్వు నన్ను రక్షించావుగా?

అలాగే, ఈ పిల్లిని కూడా కాపాడు," అంది డాగ్మర్.

అమ్మ ఏదో చెప్పబోయి, ఆ మాటలు వినగానే తటాలున ఆగిపోయింది.

"ఈ పిల్లిని ఈ రాత్రి ఈ పెట్టెలోనే పడుకోనిద్దాం. రేపు ఎలాగుంటుందో చూద్దాం," అంది అమ్మ.

ఆ రోజు రాత్రి మా అందరి చెవులకీ ఆ పిల్లి కూతలే వినపడ్డాయి. ఎప్పుడో అప్పుడు ఆ రాత్రి అది తప్పకుండా చస్తుందని నేననుకొన్నాను.

"పాపం, ఎంత బాధపడుతోందో! మీ నాన్న ఇంట్లో ఉంటే, ఏం చేయవలసిందీ చెప్పేవారు," అంది అమ్మ.

నాన్న ఏదో కార్మికుల సమావేశానికి వెళ్లాడు. రాత్రి ఆలస్యంగా ఇంటికి వస్తానని చెప్పాడు. వెనుక వసారాలోంచి విషాదకర

మైన ఆ పిల్లి అరుపులు మాకు వినబడు తున్నాయి. అమ్మ మా అందరివైపూ ఓ సారి చూసింది.

"ఏం చెయ్యాలో మీకెవరికైనా తెలుసా?" అమ్మ అడిగింది.

మాకు తెలియదన్నట్టు బుర్రలూపాం.

అప్పుడే ఎలిజెబెత్ మామయ్య వసారా లోంచి భరించలేని బాధతో గట్టిగా అరుస్తు న్నాడు.

"పాపం. ఏదో మందిచ్చి, అతన్ని మరో లోకానికి మనం సాగనంపడం మంచిది," అంది అమ్మ.

"క్లోరోఫామ్ ఇస్తే మంచిదేమో!" అన్నాడు నెల్స

అమ్మ కుర్చీలోంచి లేచింది. వెంటనే కొంత డబ్బిచ్చి, సమీపంలో ఉన్న మందుల

షాపుకి వెళ్ళి, ఒక క్లోరోఫామ్ బుడ్డీ పట్టుకు రమ్మని క్రిస్టినీతో చెప్పింది.

కాస్సేపట్లో క్రిస్టినీ క్లోరోఫామ్ పట్టు కొచ్చింది. అప్పటికప్పుడే దాగ్‌మర్ నిద్ర పోతోంది. ఎలిజెబెత్ మామయ్యకి ఆఖరి విందు సమర్పించి, అమ్మ క్లోరోఫామ్‌తో నిండిన ఒక స్పాంజిని అతను పడుకొన్న పెట్టెలో పెట్టింది. పెట్టె పై భాగాన్ని గోనె సంచీలతో కప్పి వేసింది. అటుపైన ఎలిజెబెత్ మామయ్య మౌనం దాల్చాడు. అమ్మ చేసిం దంతా మేము ఆశ్చర్యపోతూ చూశాం.

"రేపు ఉదయం ఈ పిల్లిని గురించి దాగ్‌మర్‌కి ఎలా చెప్పగలవో?" అన్నాను నేను అమ్మతో.

"పాపం, వెర్రి పిల్ల!" అంది అమ్మ క్లుప్తంగా.

మర్నాడు ప్రొద్దుటే దాగ్‌మర్ పరిగె డుతూ, వంటింట్లోకి వచ్చింది.

"అమ్మా, నా ఎలిజెబెత్ ఎలా ఉంది?" దాగ్‌మర్ ఆత్రుతగా అడిగింది.

"దాగ్‌మర్, కూర్చో. నీకో చిన్న రహస్యం చెబుతాను."

అమ్మ చెప్పే రహస్యాన్ని వినకుండానే దాగ్‌మర్ వెనుక వసారాలోకి పరుగెత్తింది. పెట్టె వద్దకు వెళ్లింది. పైన కప్పిన గోనె సంచీలను మెల్లగా బయటకు తీసింది. ఓసారి వంగి, పెట్టెలోకి చూసింది.

"ఎలిజెబెత్, బాగున్నావా?" అని కేక లేస్తూ, పెట్టెలోంచి వెలువడుతున్న క్లోరోఫామ్ వాసనని గుర్తించి, ఆశ్చర్యపోయింది.

మేమందరం కూడా సమీపంలోనే ఉన్నాం. అసలు రహస్యం చెబుదామని అమ్మ దాగ్‌మర్ దగ్గరగా నడుస్తోంది. పెట్టెలో పడుకొన్న పిల్లిని దాగ్‌మర్ తీసి, బయట నేలమీద పడేసింది. ఎలిజెబెత్ మామయ్యని చూస్తూంటే, నాకు చాలా.

ఆశ్చర్యం వేసింది. మామయ్య చనిపోలేదు. ఆవలిస్తూ లేచాడు. బాగా వాచిన రెండు కళ్ళూ ఇప్పుడు కొంచెం తగ్గాయి. తలమీద మేము చూసిన గడ్డ విచిత్రంగా కరిగిపో యింది. ఒక్కసారి సంతోషంతో మామయ్య కూతలు కూస్తూ, వసారాలో ఇటూ అటూ తిరగసాగాడు.

దాగ్‌మర్ అమ్మ రెండు చేతుల్నీ పట్టు కొంది.

"నాకు తెలుసమ్మా...నువ్వు నా ఎలిజె బెత్‌ని తప్పక రక్షిస్తావని తెలుసమ్మా," అంది దాగ్‌మర్.

"దాగ్‌మర్, కాని, మరో పనికోసం నేను క్లోరోఫామ్ ఇచ్చాను..."

కాని, అమ్మ మాటలు దాగ్‌మర్ విని పించుకోలేదు.

ఇంత విచిత్రంగా బ్రతికి, మళ్లా తిరుగు తున్న ఎలిజెబెత్ మామయ్యని చూసి, అమ్మ ఆశ్చర్యపోతూ నాన్న దగ్గరగా వెళ్లింది.

"పిల్లికి తొమ్మిది ప్రాణాలుంటాయి. అందువల్ల బ్రతికి ఉంటుంది. అంతేకాక నువ్వు క్లోరోఫామ్ తక్కువగా ఉపయోగించావు," అన్నాడు నాన్న.

"జరిగిందేదో జరిగింది. కాని, ఒక్క విషయం మీరు డాగ్మర్‌కి చెప్పాలి. నేను ప్రతి పనీ చెయ్యగలననే నమ్మకం డాగ్మర్‌కి ఉండడం అంత మంచిది కాదు," అంది అమ్మ.

"ఇప్పుడదంతా మనం చెప్పడం అనవసరం. మరి కొన్నేళ్ళు గడిస్తే, డాగ్మరే నేర్చుకుంటుంది," అన్నాడు నాన్న.

# 14

ఆ సంవత్సరం చివర సమయంలో మరో ఏడుగురు మా ఇంట్లో అద్దెకు ప్రవేశించారు. స్టాంటన్ సోదరులు లెవిస్, క్లార్క్ అనే మరో ఇద్దరిని తీసుకొచ్చి, మా ఇంట్లో ప్రవేశపెట్టారు. వాళ్ళిద్దరినీ ఘనంగా వర్ణించి, వాళ్ళేదో అఖండమైనది కనిపెట్టారని స్టాంటన్ సోదర్లు వాళ్ళపై ఛలోక్తులు విసురుతూండేవారు. నిజం చెప్పాలంటే లెవిస్, క్లార్క్ ఇద్దరూ గాస్ అండ్ ఎలక్ట్రికల్ కంపెనీలో అకౌంటెంట్లుగా పనిచేసేవారు.

ప్రొఫెసర్ జెన్నో, అతని భార్య పక్కనున్న రెండు పెద్ద గదులలోకి మారారు. ఒక గదిలో మధ్యగా పియానో అమర్చుకున్నారు. చింపిరిజుట్టుతో చీదరగా కనబడే ప్రొఫెసర్ పియానోని ఎంతో శ్రావ్యంగా వాయించేవాడు. అతని భార్య తరచూ పోలిష్ పాటలు కమ్మగా పాడుతూండేది.

శామ్ స్టాన్‌టన్‌కూ, మిస్ డురాంట్‌కి మధ్య స్నేహం ఎక్కువయింది. ఇద్దరూ కలిసి ఎప్పుడూ తిరిగేవారు. పై అంతస్తులో ఉన్న తన గదిని డురాంట్, జాక్కికి చ్చేసి, శ్యామ్‌తో కలిసి క్రిందనున్న ఒక పెద్ద గదిలో ప్రియులిద్దరూ ఉండటానికి నిశ్చయించుకున్నారు.

నేను హైస్కూల్లో చేరాను. నెల్సు నాకంటే పై క్లాస్ చదువుతున్నాడు. విన్ ఫోర్డ్‌లో మా క్రిస్టినీ పెద్ద పరీక్షకు చదువుతోంది. ఎంతో కష్టపడి చదివి, విన్ ఫోర్డ్ మెడల్ సంపాదించింది.

క్రిస్టినీ తెలివితేటలకి అమ్మా, నాన్నా ఎంతో మురిసిపోయారు. క్రిస్టినీకి బహుమతిగా వచ్చిన మెడల్‌ని ముఖమల్ పెట్టెలో పెట్టి, అమ్మ బీరువాలో భద్రం చేసేది. ఆ పతకాన్ని పిన్నిలకీ, బాబాయిలకీ, చివరికి మాకు వాడుకగా కిరాణా సామాన్లు ఇచ్చే టీకీ కూడా చూపించేది.

క్రిస్టినీ పెద్ద చదువుకోసం హైస్కూల్లో చేరుతుందనుకొన్నాం.

అమ్మకీ, నాన్నకీ మాకు చదువు చెప్పించాలనే పట్టుదల ఎంతో ఉండి. మా చదువులకోసం అమ్మా, నాన్నా ఎన్ని కష్టాలైనా పడ్డానికి తయారుగా ఉండేవారు. ఉన్నట్టుండి క్రిస్టినీ మాతో ఏమీ చెప్పకుండా మా ఊళ్ళోనే ఓవరాల్ ఫాక్టరీలో ఒక ఉద్యోగం తీసుకుంది. ఆమె మొదట తెసకా ఉద్యోగం ఏాకుకుతుందనుకోలేదు.

"నాకు బట్టలు కావాలి...ఇంకా కొన్ని వస్తువులు కూడా కొనుక్కోవాలి," అంది క్రిస్టినీ ఆ రోజున అమ్మతో.

అమ్మా, నాన్నా క్రిస్టినీకి పెద్ద చదువుల వలన వచ్చే లాభాలను గురించి చెప్పారు.

"వద్దు; నేనింక చదువుకోను," అంది క్రిస్టినీ.

క్రిస్టినీ స్పష్టంగా తాను రాత్రిబడికి కూడా వెళ్ళవలచుకో లేదని చెప్పింది. ఆమెకు యంత్రాలు నడుపుతూ, ఫాక్టరీలో పని చేయటమంటే సరదా ఎక్కువయింది. అలా పనిచేసి డబ్బు సంపాదించగలననే ధైర్యం ఆమెకి బాగా ఉంది.

గ్రామర్ స్కూలు చదువు కాగానే, ఆడ పిల్లలు ఏ పనిలోనో చేరడంలో ఆశ్చర్యం లేదు. నాతో చదివిన ఏడుగురు అమ్మాయిలు అలా పనులలోకి వెళ్లడం నాకు తెలుసు. నా ముఖ్యస్నేహితురాలు కార్మెటా కూడా చదువు మానేసి, ఫైల్ అండ్ టెన్ కంపెనీ ఉద్యోగంలో చేరింది.

తనకి బహుమతిగా ఇయ్యబడిన మెడల్ మూలంగా మా అందరికంటే క్రిస్టినీ ఎంతో పేరు సంపాదించింది. అటువంటి క్రిస్టినీ చదువు మానేసి, ఉద్యోగంలో చేరడం మమ్మల్ని అందరినీ ఎంతో బాధ పెట్టింది.

ఉద్యోగం చెయ్యడమంటే మాకూ సరదా గానే ఉండేది. కాని, చదువు మానేసి ఉద్యోగం చెయ్యడమంటే ఏదో బాధగా ఉండేది. అందువల్లే నెల్సన్, నేను సెలవు రోజుల్లోనే ఉద్యోగం చేస్తూండే వాళ్ళం.

అమ్మ ఎంత చెప్పినా, క్రిస్టినీ వినలేదు. క్రిస్టినీ మొదలనుండా తన పనేదో తాను చూసుకునేది. అమ్మనీ, నాన్ననీ మాలో ఒకళ్ళు ఎదిరించడం ఇదే మొదటిసారి. మేమందరం ఈ సంఘటనకి ఎంతో బాధ పడ్డాం.

అమ్మ మనస్సులోని విచారమూ, ఆందోళనా క్రిస్టినీ తెలుసుకోడానికి ఏమీ ప్రయత్నించలేదు. రోజూ ప్రొద్దున్నే లేచి, భోజనం చేసి, ఫాక్టరీకి తన దారిని తను వెళ్ళి పోయేది.

తన మొదటివారం జీతం ఇంటికి తెచ్చి, వంటింట్లో అమ్మకెదురుగా ఉన్న టేబుల్

మీద పెట్టి, "అమ్మా, ఇది నీ కోసమే," అంది క్రిస్టినీ, అమ్మ కళ్ళల్లోకి చూస్తూ.

అమ్మ ఆ చిల్లర కాసులను చూసి, విచార సూచనగా తల ఆడిస్తూ, "నాకు అక్కర లేదు," అంది.

"ఏమిటమ్మా, ఇందులోని లోపం ఏమిటి? ఇది నేను కష్టపడి సంపాదించిన డబ్బు!"

అమ్మ మళ్ళీ తల ఊపి, "చూడు క్రిస్టినీ, ఈ డబ్బు మంచిది కాదు. నువ్వు ఈ డబ్బుని నీ యౌవనాన్ని వెచ్చించి, సంపాదించావు. చదువుకుని ఎంతో విజ్ఞానం పొందవలసిన చిన్నతనంలో, సంపాదనకి దిగటం మంచిది కాదు. క్రిస్టినీ! ఇప్పటికైనా ఉద్యోగం మాట మర్చిపోయి, కాట్రిన్, నెల్సతో పాటు నువ్వు కూడా చదువుకోడానికి హైస్కూల్ కి వెళ్లడం మంచిది," అంది అమ్మ.

క్రిస్టినీ ఏం జవాబూ చెప్పకుండానే బయటకు వెళ్లిపోయింది. అమ్మ కూడా ఆ డబ్బును

తాకకుండా తన పనిలో మునిగిపోయింది. టేబుల్ తుడుద్దామని వంటింట్లోకి వెళ్ళేసరికి దానిమీదున్న డబ్బు నా కళ్ళకి అవుపడింది.

ఆ డబ్బు ఆ టేబుల్ మీద అలాగే పడి ఉండేది. ఎవరూ దాన్ని తాకేవారు కాదు. ఆ డబ్బుని చూస్తూంటే, ఏదో బాధ మా అందరినీ పీక్కు తినేది. మా కుటుంబంలో ఎవరో చేసిన పొరబాటుకి చిహ్నంగా ఆ డబ్బు అగుపించేది.

"దానిష్టం వచ్చినట్టు చెయ్యనీ. నువ్వు బాధపడటం దేనికి?" అన్నాను అమ్మతో. కాని, అమ్మకి నా మాటలు తృప్తి కలిగించ లేదు.

మొదటి వారం, రెండో వారం – క్రిస్టినీ జీతాలు టేబుల్ మీద పోగుపడ్డాయి.

అమ్మ తన పెట్టెలోంచి డబ్బు తీసి, క్రిస్టినీకి ఎర్రటి ఊలుగౌను కొన్నది.

"క్రిస్టినీ! ఎర్రటి గౌను అంటే నీకు ఇష్టం కదూ?" అంటూ అమ్మ సంతోషంతో తను కొన్న గౌన్ని క్రిస్టినీకిచ్చింది.

గౌను చాలా బావుంది. క్రిస్టినీ కళ్ళు మెరిశాయి. మాట్లాడకుండానే మురిసిపోతూ, ఆ గౌను తీసుకుని తన పెట్టెలో దాచుకుంది. హైస్కూల్లో ఆడ పిల్లలంతా ఇలాంటి గౌన్లే తొడుక్కుంటున్నారనీ, గౌను జాగ్రత్తగా వాడుకోమనీ అంది అమ్మ క్రిస్టినీతో.

కాని, క్రిస్టినీ మనస్సు మార్చలేక పోయామని అమ్మకి లోలోపల ఎంతో దిగులుగా ఉంది.

మూడో వారం జీతం కూడా క్రిస్టినీ టేబుల్ మీద పడేసింది. మా అందరికీ ఏదో భారంగా తోచింది. మేము నవ్వులూ, పరిహాసాలూ మాని, టేబుల్ చుట్టూ కూర్చుని, హోమ్‌వర్క్ చేసుకునేవాళ్ళం. క్రిస్టినీ పని చేసి అలసిపోవడంవల్ల రోజూ రాత్రులు

పెందరాళే తన పక్కమీదకి వెళ్లి, పడుకు నేది. ఆమె మా పక్కన లేకపోవడం మాకేదో తీరని లోటుగా కనిపించేది.

నాన్నకి పని ఎక్కువైంది. ఇంటికి చాలా ఆలస్యంగా వచ్చేవాడు. నాన్న అదనంగా తను పనిచేసి సంపాదించే డబ్బుతో అమ్మకి ఒక కోటు కొంటానని చెప్పాడు.

"నువ్వెప్పుడూ కోటు కొంటానికి వెళ్లినా, ఆ సంగతి మర్చిపోయి, ఇంటికి కావలసిన మరో వస్తువేదో కొనడం జరుగుతోంది. ఈ సారి తప్పకుండా కోటు కొనుక్కోవాలి సుమా!" అన్నాడు ఆప్యాయంగా అమ్మతో నాన్న.

అమ్మ అలాగే కొనుక్కుంటానని తల ఊపింది.

అమ్మ ఎలాంటి కోటు కొనుక్కోవాలో మేమంతా సలహాలిచ్చాం. దాగ్మరూ,

నేనూ కోటుమీదా, కాలరుమీదా ఎక్కువ ఉన్ని ఉండాలన్నాం. ముఖ్యంగా కాలర్ దగ్గర ఉండాలి. చాక్లెట్ రంగులో ఉండాలన్నాడు నెల్స్. అన్నిటికంటే ముఖ్యంగా ఎలాంటి కోటు కొన్నా, వెచ్చదనం ఇచ్చేది కావాలి అన్నాడు నాన్న. క్రిస్టినీ మాత్రం నోరు మెదపలేదు.

మర్నాడు స్కూలునుంచి త్వరగా ఇల్లు చేరాను. చెల్లెలు కారిన్‌కి పరిచర్య చేస్తూ, కోటు కొనుక్కోడానికి అమ్మకి కాస్త తీరిక కల్పించాను.

అమ్మ ఎప్పుడు బయటకు వెళ్ళినా, త్వరగానే ఇంటికి వచ్చేస్తుంది. నాన్న, నెల్స ఇల్లు చేరారు. క్రిస్టినీ కూడా ఇల్లు చేరింది. డాగ్‌మర్, నేనూ భోజనశాలలో మధ్యగా డ్రాయర్ అమర్చాము. స్టవ్‌లో కట్టెలు పడేసి, రొట్టెలు కోశాము.

అమ్మ ఎలాంటి కోటు కొని తెస్తుందో అని వంటింట్లో కూర్చుని, మేమందరం ఊహి

స్తున్నాం. అంతలో అమ్మ బరువుగా ఒక పాకెట్ మోస్తూ, వంటింట్లోకి వచ్చి, కుర్చీలో కూలబడింది.

"కోటు ఎలా ఉందో చూద్దాం!" అంది కేకలేస్తూ డాగ్‌మర్.

"బాగానే ఉంది. ఆగండి చెబుతాను," అంది అమ్మ నెమ్మదిగా. ఆమె ఎలాగూ కోటు కొని ఉండదని మాకు తెలుసు.

నెల్స్ అమ్మ తెచ్చిన పెద్ద పాకెట్ విప్పి, అందులోంచి ఒక డజను పుస్తకాలు తీసి, టేబుల్ మీద పేర్చాడు.

"పూర్తి హైస్కూల్ కోర్స్. సులువుగా చదవగలిగిన పన్నెండు వాల్యూములు," అని చదివాడు నెల్స్.

"క్రిస్టినీకోసం ఈ పుస్తకాలు తెచ్చాను. అది రాత్రులు ఇంట్లో చదువుకుంటే చాలు.

కావలసినంత విద్య అబ్బుతుంది," అని అమ్మ క్రిస్టినీవంక చూసి, "మీ అమ్మకోసం ఈ పనైనా చెయ్యొచ్చు," అని బాధతో నవ్వింది.

క్రిస్టినీ పెదవి కొరుక్కుంటూ, మా వంక నిస్సహాయంగా చూసింది.

ఆమె పుస్తకాలను తడివి చూస్తూ, "నీ కోటు డబ్బు ఇలా ఖర్చు పెట్టావన్నమాట?" అంది.

అమ్మ ముఖం చిట్లించి, "నా కోటు తర్వాత కొనుక్కుంటాను...కాని, క్రిస్టినీ..." అని ఏదో అనబోయింది.

క్రిస్టినీ ఒక్కసారి ఆనందంతో ఊగిపోయింది. అమ్మ తన బాగు కోరి, తన అభివృద్ధి కోసం ఎన్నో ప్రయత్నాలు చేస్తోంది. ఇంకా తాను మంకుతనం చూపిస్తే, అందర్లో మూర్ఖురాలనిపించుకోవాలని ఆమె పశ్చాత్తాప పడింది. చిరునవ్వుతో అమ్మ కళ్ళల్లోకి

చూస్తూ, "రేపు! రేపు తప్పకుండా నెల్స్, కాథరీన్లతో కలిసి నేనూ స్కూలుకి వెళ్లి చదువుకుంటాను," అంది క్రిస్టినీ.

మేమంతా ఏదో అనబోయాము.

దాగ్‌మర్ కంఠం బిగ్గరగా ధ్వనించింది.

"అయితే, ఆ బల్లమీదున్న డబ్బుని ఏం చేస్తారు?" అంది దాగ్‌మర్.

క్రిస్టినీ బల్లమీంచి ఆ డబ్బు తీసేసి, "ఈ డబ్బు మన ఎర్రపెట్టెలో వేస్తున్నాను. దీంతో కుర్చీలు కొని, అతిథులకోసం ఖర్చు పెడదాం," అంది.

అమ్మ రాకింగ్ ఛెయిర్‌లో కూర్చుని, కారిన్‌ని చేతుల్లోకి తీసుకుంది. వంటిల్లు వెచ్చగా, ఒంటికి హాయిగా ఉంది. ఎలిజెబెత్ మామయ్య పొయ్యిదగ్గర కూర్చుని, సన్నంగా అరుస్తోంది. ప్రొఫెసర్ జెన్సో పియానో వాయిస్తున్నాడు. ఆ నిశ్శబ్దంలో పియానో

శబ్దాలు పిల్లగాలిలో తరంగాలై మా చెవులకి శ్రావ్యంగా తగులుతున్నాయి. స్టాంటన్ సోదరులూ, లెవిస్, క్లార్క్, డురాంట్ హాల్లో కబుర్లు చెప్పుకుంటున్నారు.

అమ్మ మావంక ఆనంద పారవశ్యంతో చూసింది.

"చివరికి అంతా బాగుంది!" అందామె తృప్తిగా.

# 15

లోవెల్ హైస్కూల్లో నేనూ, క్రిస్టినీ గడిపిన సంవత్సరాలు చకచక హాయిగా గడిచి పోయాయి. మా రెండు రంగుల జుత్తుకి తమాషాగా బంగారు వన్నె వచ్చింది. మా వళ్ళు, మా శరీరాలు అందంగా, ఆకర్షణీయంగా తయారయ్యాయి. స్కూల్లో మా దుస్తులు, చేష్టలు చూసిన విద్యార్థులందరికీ మామీద మంచి గౌరవభావం ఏర్పడింది.

మా స్కూల్లోని ముమ్మర్స్ క్లబ్‌లో నన్ను మెంబరుగా చేరమని అడిగారు కొందరు. నేను నాటకాల్లో పాల్గొన్నాను. క్రిస్టినీ వాగ్వివాద పోటీల్లో ముందంజ వేసింది. నెల్స తన యూనివర్సిటీ కోర్సు నాలుగో సంవత్సరం చదువుతున్నాడు.

బేబీ కారిన్ ఇంట్లో వంటరిగా ఉండి పోయేది. అది మా ఆరుగురికీ ప్రేమ పాత్రమై

పోయింది. దాగ్మర్ మాత్రం రాత్రిళ్ళు ఇంకా పిల్లి పిల్లల్నీ, కుక్క పిల్లల్నీ తీసుకొచ్చి, వాటితో కాలం గడిపేది.

ఇప్పుడు మా కుటుంబంలో ఏ కలతా లేకుండా సాఫీగా సాగుతోంది. ఒక్కొక్క సారి అమ్మా, నాన్నా నార్వీజియన్ భాష మాట్లాడేవారు. వాళ్ళిద్దరూ తరుచు పేకాట ఆడి, క్లబ్బులూ, సినిమాలూ తిరిగి వస్తూండే వారు.

మా స్టీనర్ వీధి ఇల్లు కళకళలాడుతోంది. బొత్తిగా భోజనశాలగా మారకుండా మా ఇల్లు విజ్ఞాన వినోదాలకు ఆటపట్టయింది. మా కుటుంబంలో భాగస్తులయి, మా స్నేహం సంపాదించడానికి అనేకమంది మా ఇంటికి వచ్చి, అతిథులై పోతూండేవారు.

జేన్, మార్గరెట్ రాన్‌డాల్ఫులిద్దరూ మేడ మీద వెనుక తట్టున ఎండైనా తగలని చీకటి గదిలో ఉంటున్నారు. వాళ్ళ

ముఖాల్లో ఎక్కడా సంతోషం లేదు. వాళ్ళిద్దరూ ఒకసారి అమ్మతో తాము జీవితాలు గడపడం కష్టంగా ఉందని మొరపెట్టుకున్నారు. రాన్‌డాల్ఫ తండ్రి శాన్‌ఫ్రాన్సిస్కోలో బాగా డబ్బు సంపాదించిన రోజుల్లో వాళ్ళిద్దర్నీ అందరూ అందమైన పిల్లలని చెప్పుకునేవారు. వాళ్ళు చేతిపనులు చేసి, వాటిని ఆడవాళ్లకి అమ్మి, స్వల్ప ఆదాయం సంపాదించేవారు.

గ్రాడీ అనే పోలీసు ఉద్యోగి మేడమీద రాన్‌డాల్ఫ గది ముందు ఎందుకో పకపక నవ్వుతున్నాడు. అతను మార్గరెట్, జేన్‌లకు ఒక పిప్పర్‌మెంట్లు పెట్టె బహూకరించాడు. అతను తన బహుమానానికి వాళ్ళెంతో మెచ్చుకున్నారనుకుని, తృప్తిపడ్డాడు. మేము చూసీ చూడనట్టు ఊరుకున్నాం.

నాన్న గది కిటికీలు బాగు చేయించి, నేల మీద చెక్క పరపించాడు. లెవిస్, క్లార్కులిద్దరూ, స్టాంటన్ సోదర్లూ వాటికి రం

గులు వేసి, నాన్న పనికి సహాయపడ్డారు. శామ్, డ్వ్యారెంట్ లిద్దరూ బెంచీల మీద కుషన్లు తయారు చేశారు. రాన్ డాల్ఫ్ దీపాలకు చక్కని డోములు తయారు చేసింది.

ప్రొఫెసర్ జెన్సో ఒక పాత పియానో సంపాదించాడు. గ్రాడీ ప్రొఫెసర్ కు ఓ ఫోనోగ్రాఫ్ బహూకరించాడు.

నెల్సి మా గదికి 'గ్లోరీహాల్' అని పేరు పెట్టాడు. ప్రతి సాయంత్రం మా ఇరుగు పొరుగు వాళ్ళందరూ ప్రొఫెసర్ ఫోనోగ్రాఫ్ వినడానికో, ఆయన పియానో వినడానికో మా ఇంటికి వస్తూండేవారు. ప్రొఫెసర్ భార్యని పోలిష్ పాటలు పాడమని వాళ్ళందరూ బ్రతిమాలేవారు.

మా క్రిస్టినీ, నెల్సి, నేనూ కూడా మా మిత్రుల్ని ఆహ్వానించేవాళ్ళం. వాళ్ళకి విందులిచ్చి, కుర్రకారులో మేము పెద్దవాళ్ళల్లా మన్నన పొందేవాళ్ళం కూడాను.

మా మిత్రమండలిలో జానీ కేన్ మూర్, అతని అందాల భార్య చేరారు. కేన్ మూర్ ప్రతి ఆదివారం మిత్రుల్ని తీసుకుని, విమానంలో మెరీనా అంతా తిప్పేవాడు. కేన్ మూర్ బయటకు వెళ్లినప్పుడు అతని భార్య మా అమ్మతో వంటింట్లో కబుర్లు చెప్తూ కూర్చునేది. ఫోన్ లో కేన్ మూర్ ఇంటికి వస్తున్నానని చెప్పేవరకూ ఆమె అమ్మతోనే ఉండేది.

నాన్న విమాన ప్రయాణాల గురించి ఆసక్తితో మాట్లాడేవాడు. కేన్ మూర్ తన విమాన అనుభవాలు మా నాన్నతో వర్ణించి చెప్పేవాడు. నాన్న కళ్ళు సంతోషంతో మెరిసేవి.

"ఆకాశంలో విమానంపై ఎగరడమనేది ఎంత అద్భుతమైన సంగతి!" అన్నాడునాన్న.

"చాలా బాగుటుంది!" అన్నాడు కేన్ మూర్.

"ఆకాశంలో పక్షిలా ఎగరడం గొప్ప విషయమే!"

"మీకు తీరికైనప్పుడు విమానంలో మిమ్మల్ని ఒకసారి తీసికెడతాను," అన్నాడు కేన్ మూర్.

నాన్న సంతోషంతో తల ఊపాడు. కాని, అమ్మ లోపల 'అమ్మయ్యో!' అనుకుంది. నాన్న అది గ్రహించాడు.

"ఇప్పుడు వద్దులే, కేన్!" అన్నాడు నాన్న.

"అలా కాదు; మీ రొక్కసారి నాతో విమానం ఎక్కాలి," అన్నాడు కేన్.

మళ్ళీ నాన్న అమ్మకేసి చూశాడు. ఆమె తల వంచుకుని, తన కుట్టుపని చూసుకుంటోంది.

"నేను రాలేను. నేను నేలమీదే ఉండటం మంచిది," అన్నాడు నాన్న.

"ఆయన్ని బలవంతపెట్టకండి," అంది కేన్‌మూర్ భార్య.

తర్వాత విమాన ప్రసక్తి ఆగిపోయింది. నాన్న మళ్ళీ ఏమీ అనలేదు. కాని, అమ్మ నాన్న ముఖంలోకి చూస్తూ, మధ్య మధ్య ఆయన ఏం ఆలోచిస్తున్నాడో గ్రహించ డానికి ప్రయత్నించింది.

ఒకనాడు నేనూ, అమ్మా కలిసి దొడ్లో బట్టలు ఆరవేస్తున్నాం.

"కాట్రిన్, విమానాలెక్కి, ఆకాశంలో వెళ్ళడం ప్రాణాలతో చెలగాటమే... తెలి సిందా? నాకు చెడ్డ భయం," అంది అమ్మ. నేనేమీ సమాధానం ఇవ్వలేదు. ఆమె విమానాలంటే తనకెంత భయమో వివ రించింది.

ఆదివారాలు అమ్మ ఎవరికీ భోజనాలు వడ్డించదు. ఒక ఆదివారం నాన్నా, నెల్స

# 16

అమ్మ కలలలో ఒకటి నిజమైన రూపం దాల్చింది.

మేం అతిథులతో కలిసి అందరం వంటింట్లో ఒకే చోట భోజనాలు చేసే వాళ్ళం.

మాతో సల్లీ దంపతులు కలిశారు. వాళ్ళు ఏవో ఆఫీసుల్లో పని చేస్తున్నారు. బార్లెట్ అనే ప్రయివేట్ స్కూల్ కళాధ్యాపకురాలు కూడా మాతో కలవడంతో మేం మొత్తం పదిహేనుమంది అయ్యాం.

అతిథులవల్ల మాకు కొంత ఆదాయం లభిస్తున్నప్పటికీ నాన్న ఆఫీసులో కష్టపడి పని చేస్తూనే ఉన్నాడు. మా ఇంట్లోని చిన్న బాంక్ ఇప్పుడు డబ్బుతో నిండుగానే ఉంది. ఆ బాంక్‌లోని డబ్బు ఎలా ఖర్చు పెట్టాలో అమ్మ మాకు చెప్పడం మొదలెట్టింది.

కొంత డబ్బు క్రిస్టినీ నర్సు ట్రెయినింగ్‌కీ, కొంత డబ్బు కాట్రిన్ నార్మల్‌లో చదవ బోయే మేస్టరీ ట్రెయినింగ్‌కీ, కొంత నెల్సు డాక్టరైన తర్వాత పెట్టబోయే ప్రాక్టీసుకి కావలసిన పరికరాలకీ ఖర్చుపెట్టాలంది అమ్మ.

నెల్సు పట్నంలోనే ఉంటున్నాడు. వాడికి కౌంటీ ఆస్పిటల్‌తోనే సరి పోతోంది కాలం. వారానికోసారి ముఖ్యంగా ఆదివారం ఇంటికొచ్చేవాడు. మా అతిథు లందరికీ నెల్సు అంటే మిక్కిలి గౌరవం. నెల్సు ఛలోక్తులతో అందర్నీ నవ్వించే వాడు. అందరూ నెల్సు త్వరగా డాక్టరయితే గాని తమ రోగాలు తగ్గవనేవారు.

అమ్మా, నాన్నా నెల్సు డాక్టర్ అవుతా డని మురిసిపోయేవారు. మేధావి, ప్రజాభి మాని అయిన కొడుకుంటే, తల్లిదండ్రుల ఆనందానికి హద్దు ఉంటుందా?

"మూశారా! అబ్బాయి డాక్టరై ప్రజల బాధలూ, రోగాలూ పోగొడతాడు. వాడు అందరి ప్రాణాలూ కాపాడగలడు," అంది అమ్మ.

"అంతే కాదు, అందర్లోకీ గొప్పవాడని పించుకుంటాడు," అంది దాగ్మర్.

"గొప్ప కాదు కావలసింది; ప్రజల రోగాలు పోగొట్టి, వాళ్ళకి మేలు చెయ్యడం ముఖ్యం," అంది అమ్మ.

నెల్సన్ కోరా మార్టిన్ అనే అందమైన అమ్మాయిని ప్రేమిస్తున్నట్టు తెలిసింది. నెల్సన్ని కోరా తనింటికి తరుచు తీసుకెళ్ళేది. నెల్సన్ ఆమెను పెళ్ళిచేసుకోవాలని తొందర పడుతున్నాడు. ఈ సంగతి అమ్మ నాన్నతో చెప్పడం విన్నాను.

"మనవాడు కూడా ఆమెని ప్రేమిస్తున్న ట్టున్నాడు," అన్నాడు నాన్న.

అమ్మ ముఖం ముడిచి, "వాడు తొందర పడుతున్నాడు. ఏమంత గొప్ప సంబంధమని మురిసిపోతున్నాడోగాని, తర్వాత ఏం బాధ పడతాడో అని నా చింత," అంది అమ్మ.

మర్నాడు రాత్రి పట్నం వెళ్ళే ముందు నెల్సన్ కోరా మార్టిన్‌ని మా ఇంటికి తీసుకొచ్చాడు. ఆమె దాగ్‌మర్‌తో గబగబ మాట్లాడింది. దాగ్‌మర్ కోరాకి కారుండనీ, ఆమె తన ఇష్టం వచ్చినట్టు దానిలో తిరుగుతుందనీ కోరా మాటల్ని బట్టి గ్రహించింది.

ఆమె నన్ను "చిన్న చెల్లాయ్!" అని పిలిచింది. తనకిద్దరు అన్నలున్నారని, తానేం చెప్పినా వాళ్లిద్దరూ విని, తన్ను గారాబంగా చూస్తారని చెప్పింది.

మిస్ కోరా మార్టిన్ అమ్మతోనూ, నాన్నతోనూ బాగా గంభీరంగా మాట్లాడింది. నెల్సన్‌ని 'నెల్సన్' అని ఆప్యాయంగా పిలిచేది. నెల్సన్ పేరు బాగా లేదని, నెల్సన్

అంటే బావుంటుందని అమ్మతో చెప్పింది నోరా.

"నెల్సన్ అంటే వాడి తాత పేరు," అన్నాడు నాన్న. ఆమె నవ్వుకుంది.

నాన్న ముందు నెల్సన్ లేచి, వినయంగా నిలబడి, అమ్మతో చెప్పి, మిస్ మార్టిన్ని తీసుకుని ఆస్పిటల్ కి బయల్దేరాడు.

మార్టిన్ నెల్సన్ భుజం పట్టుకుని ఆపి, "అది సరే...డాక్టరు అయి, రోగులికి బానిస కావాలనా మీ తహ తహ?" అని ప్రశ్నించింది. "ఈయన మనస్సు మార్చడానికి ప్రయత్నిస్తా," అంది మావైపు అదో విధంగా చూస్తూ.

వాళ్ళిద్దరూ నవ్వుతూ, వెళ్ళి పోయారు. నెల్సన్, మార్టిన్ లు వెళ్ళిపోయాక మా సంభాషణ ఆగిపోయింది.

అమ్మ నిట్టూర్చింది. మార్టిన్ తలిదండ్రులికి కబురు చెయ్యాలంది అమ్మ. మేం వచ్చే ఆది

వారం అక్కడికి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాం.

"అమ్మా, మనం పిల్లనిమ్మని అక్కడికి వెళ్ళడమేమిటి? లోక విరుద్ధం కదూ?" అంది క్రిస్టినీ అమ్మతో.

"మనం పెళ్ళికొడుకు తరఫున ఉన్నాం కనక ఆ అమ్మాయిని అడగడానికి అక్కడికెళ్ళటం మన వొంతు. ఆ పిల్ల తెలిదండ్రులతో ముందు మనం స్నేహంగా ఉండాలి," అంది అమ్మ.

క్రిస్టినీ మాటలతో నిమిత్తం లేకుండా ఆదివారంనాడు మేమందరం ముస్తాబై, టాక్సీలో బయలుదేరి, స్కిఫ్‌లో ఉన్న మార్టిన్ ఇంటికి వెళ్ళాం.

వాళ్ళది రెండంతస్తుల తెల్లని మేడ. ఆ మేడ చుట్టు గులాబీతోట. మమ్మల్ని చూసి, తెల్లకోటు తొడిగిన ఓ జపాను కుర్రాడు

నవ్వుతూ లోపలికి తీసుకెళ్లాడు. అప్పుడే మార్టిన్ తల్లి మేడమెట్లు దిగి, కిందికి వచ్చింది.

ఆమె కూడా అంకుల్ త్తే. ఆమె తన కూతురు కంటే వేగంగా మాట్లాడింది.

"మీరంతా వచ్చినందుకు చాలా సంతోషం," అందామె. ఆమె కళ్ళు తన రిస్ట్ వాచీ మీదికి మళ్ళుతున్నాయి. "మీరు వస్తారని తెలియదు. నాకీవేళ మధ్యాహ్నం ఒక పార్టీ ఉంది. మేం కొంత మంది కలిసి మాజాంగ్ అనే ఆట ఆడాలి. అది మంచి ఆట. మీరు ఆడతారా?" అందామె.

అమ్మ తల ఊపి, వెళ్లిపోదామని వెనక్కి తిరిగింది. అంతలో మార్టిన్ అమ్మని ఆగమని, అప్పుడే వచ్చిన తన భర్తని మాకు పరిచయం చేసింది.

మిస్టర్ మార్టిన్ హృదయ పూర్వకంగా మాకు స్వాగతం చెబుతూ, నాన్నతో కర

చాలనం చేశాడు. తర్వాత అమ్మకి ధన్య వాదాలు చెప్పాడు.

"మీ అబ్బాయి నెల్సన్ చాలా మంచి వాడు," అని ప్రస్తావించాడు మార్టిన్.

"నెల్సన్ కాదు; నెల్స్న," అన్నాడు నాన్న.

"మంచివాడు. నాకంటె ముందుగానే అమ్మాయి ఆ సంగతి తెలుసుకుంది," అంది మార్టిన్ భార్య.

అమ్మ లోలోపల సంతోషించింది.

మార్టిన్ భార్య మమ్మల్ని కూర్చో మనైనా అనలేదు. మేమందరం చుట్టూ అసహ్యంగా నిలబడి ఉన్నాం. మార్టిన్ గర్వంతో మమ్మల్ని అనేక ప్రశ్నలు వేసింది.

"నల్సన్‌కి మీరందరూ అంటే చాలా ప్రాణం కదూ?" అంది మార్టిన్ భార్య.

ప్రభుత్వం వాళ్ళని ఉరితీసి పారేస్తుంది,"
అన్నాడు కోపంగా.

నాకు ఆ దంపతుల ప్రవర్తన, మాటల ధోరణి వింతగా తోచాయి. అమ్మనీ, నాన్ననీ వాళ్ళు కించ పరచడం నాకు కటువుగా తోచింది. వాళ్ళల్లో ఎక్కడా మర్యాద లేదు. భార్యా భర్తాలు పరస్పరం విరుద్ధ భావాలతో రగులుతున్నారు.

తర్వాత మార్టిన్ భార్య చిరునవ్వుతో మాటల ధోరణి మార్చింది.

మేమింకా నిలబడే ఉన్నాం. నా కాళ్ళు లాగాయి. వెంటనే గోడకి జార్లబడ్డాను. జపాను కుర్రాడు ఒక ట్రేతో అందరికీ టీ, కేక్‌లూ, సాండ్‌విచ్‌లూ పట్టుకొచ్చాడు. నేను క్రిస్టినీ వంక చూశాను. ఆమె నన్ను కుర్రాడి దారికి అడ్డం లెమ్మన్నట్టు కళ్ళు చిట్లించింది. నేను పక్కకి తప్పుకున్నాను.

జపాను పర్రాడు ఛ్రేట తీసుకెళ్ళి, పక్క గదిలో పెట్టాడు.

నెల్సన్, మిస్ కోరా మార్టిన్ అప్పుడే వచ్చి, మా ముందు నిలబడ్డారు. రూపర్ట్ వాళ్ళిద్దర్నీ చూసి నవ్వుతూ, మాదగ్గరి కొచ్చాడు.

మిస్ కోరా మార్టిన్ తెల్లటి సిల్కు దుస్తులు ధరించింది. ఆమె మమ్మల్ని చూసి, వినయంగా నెల్సన్ భుజం మీద చెయ్యి వేస్తూ, ధన్యవాదాలు చెప్పింది. నెల్సన్ ముఖం వివర్ణమైంది. మేము దరం హాలులో నిలబడి ఉండటం గమనించాడు నెల్సన్.

"మేమింక వెళ్ళిపోవాలి," అంది అమ్మ.

అమ్మా, నాన్నా మార్టిన్ దంపతులతో కరచాలనం చేశారు.

అమ్మ నెల్సన్‌తో "భోజనానికి ఇంటికి వస్తావా?" అంది.

"క్షమించాలి. అయినా, నేనూ టెన్నిస్ ఆడాలి," అంది కోరా మార్టిన్.

మేమందరం ఇల్లు చేరాము. అమ్మా, నాన్నా వంటింట్లో కూర్చున్నారు. వాళ్ళ ముఖాల్లో ఏదో బాధ కనిపిస్తోంది. నేను హాలులో కాలు కాలిన పిల్లిలా తిరుగుతున్నాను.

నెల్సన్ ఇంటికి వచ్చాడు. నేను వాడిని చూసీ చూడనట్టు ఊరుకున్నాను.

"వాళ్ళేరీ?" అన్నాడు.

"వంటింట్లో కాఫీ చేస్తున్నారనుకుంటాను," అన్నాను.

"వాళ్ళేమైనా అన్నారా?"

లేదన్నట్టు తల ఊపాను.

నెల్సన్ పళ్ళు బిగబట్టి, "అదొక వింత నాటకంలా ఉంది కదూ? అవునా?" అన్నాడు.

"క్రిస్టినీ చెప్పింది నిజం. మనం అక్కడికి వెళ్లకూడదు," అన్నాను.

"వాళ్ళేవరగా వచ్చి అమ్మనీ, నాన్ననీ క్షమార్పణ కోరలేదూ? మిమ్మల్ని కూర్చోమనైనా అనలేదా?"

"లేదు. నెల్సన్."

"ఎంత అమర్యాదగా ప్రవర్తించారు?"

"చాలు నెల్సన్. ఇంక ఆ గొడవ చెప్పకు. నీకూ, మార్టిన్‌కీ మధ్య ఉండే ప్రేమకి విఘాతం కల్పించుకోకు."

"విఘాతం కంటే వేరే చేసేది లేదు," అన్నాడు నెల్సన్ నవ్వుతూ.

"ఏమన్నావ్?"

"మీరు ఇవతలకి రాగానే వాళ్ళకి సమాధానం చెప్పాను."

"నువ్వింకా ఆమెని ప్రేమిస్తున్నావా?"

"చూడు. నాకూ, ఆమెకూ ఏమీ సం బంధం లేదు. నేను ఆమెని ప్రేమించడం లేదు."

నా పెదవిపై చిరునవ్వు వెలిగింది.

"అమ్మతోటీ, నాన్నతోటీ ఏం చెబు తావ్?"

"ఏం చెప్పాలో తెలీడం లేదు. పాపం, వాళ్ళ మనస్సులు గాయపడ్డాయి."

నెల్సన్ నా భుజం మీద చెయ్యి వేసి, "నువ్వు కూడా నాతో సాయం రా. వస్తావా?" అన్నాడు.

అమ్మా, నాన్నా మావంక చూసి, లోపల బాధ పడుతున్నా, పైకి నవ్వుముఖాలు పెట్టారు. మళ్ళీ నెల్సన్ కేసి విచారంగా చూశారు.

నెల్సన్ అమ్మని ముద్దు పెట్టుకుని, నాన్న భుజాలు పట్టుకుని, "క్షమించండి," అన్నాడు.

"కూర్చో. నీ గురించే మా అమ్మా, నేనూ మాట్లాడుతున్నాం," అంటూ నాన్న అమ్మవంక చూశాడు.

"ఏమీ లేదు నెల్సన్. మా నాన్నా, నేనూ నువ్వు మార్టిన్‌ని పెళ్ళాడ్డం మంచిది కాదను కున్నాం," అంది నెమ్మదిగా అమ్మ.

"ఇవాళే అలా అనిపించిందా అమ్మా?"

"ఇవాళేమిటి?"

"మార్టిన్లు ఆడిన నాటకం చూశాక."

"దానికేంలే. అందుకోసం మేం ఏమీ కించపడ్డం లేదు. వాళ్ళకి అందం, డబ్బు ఉన్న ప్పటికీ వాళ్ళ కుటుంబ సాంప్రదాయం మంచిది కాదు."

నెల్సన్ దిగులుగా వాళ్ళవంక చూశాడు.

"మా నాన్నా, నేనూ నీకు పుట్టబోయే పిల్లల్ని గురించి వాళ్ళెలాంటి వాళ్ళవు

తారోవని ఆలోచించాము," అంది అమ్మ ఢగ్గుతూ.

"సరే. ఇంతకీ మీరేమనుకున్నారు?" అన్నాడు నెల్సన్.

అమ్మ జాలిగా నెల్సన్ తల నిమురుతూ, "నువ్వేమి అనుకోవు కదా?" అంది.

నెల్సన్ అమ్మ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ, "నేనేమీ అనుకోను. నువ్వూ, నాన్నా అనుకున్నది నిజమే. నాకు కొడుకు పుడితే, వాడు రూపర్ట్‌లా తయారౌతాడు."

"నెల్సన్!" అన్నాడు నాన్న.

నేను ఆశ్చర్యంగా నాన్న వంక చూశాను. నాన్న పొరపాటున అలా పిలిచాడా? నాన్న తాను అన్న మాటకి నవ్వుతున్నాడు. కాని, అమ్మ మౌనంగా ఊరుకుంది. అమ్మ నిశ్చలమైన కళ్ళతో నెల్సన్ కళ్ళల్లోకి చూసింది.

నెల్సన్ సంతోషంగా మామూలుగానే కనిపించాడు అమ్మకి.

"ఇప్పుడు నీలో ఏ చింతా లేదు కదా!" అంది అమ్మ.

నెల్సన్ నవ్వాడు. అమ్మ హృదయం తేలికైంది. 'అమ్మయ్యా!' అనుకుంది.

# 17

## మా అక్క చెల్లెళ్ళలో క్రిస్టినీకి ముందు పెళ్లి కావలసి ఉంది.

ఫ్రాంక్ షీల్డ్స్ అనే యువకుడు మా వెల్స్‌లో డాక్టరీ చదివాడు. క్రిస్టినీ నర్స్ ట్రెయినింగ్ అయ్యే సమయంలో దానికి ఫ్రాంక్ తటస్థపడ్డాడు. వాళ్ళిద్దరికీ స్నేహమై, ప్రణయంగా మారింది.

తర్వాత వాళ్ళిద్దరికీ వైభవంగా పెళ్ళి జరిగింది. పెళ్ళిలో మా బంధు మిత్రులంతా పాల్గొని, అన్ని విధాలా మాకు సాయపడ్డారు. రాన్‌డాల్ఫ్ క్రిస్టినీకి సొగసైన తెల్లని బట్టలు కట్టించి, రిబ్బన్లతో వా[illegible]ని అలంకరించింది. ప్రొఫెసర్ పియానో వాయించి, అందర్నీ ఆనందింపచేశాడు. జెన్నో భార్య పాడిన పాటకి నల్లీ భార్య, గ్రాడీ ఆనంద బాష్పాలు రాల్చారు. ఏల్నా పిన్ని పెళ్ళికి కావలసిన

పిండి వంటలు, కేక్‌లు పసందుగా వండింది. మిగిలిన పిన్నిలందరూ ఆమె వంట చెయ్యడంలో ఎంతో సాయపడ్డారు. పెళ్ళికొచ్చిన పెద్దలందర్నీ గ్రాడీ తనకి తెలిసిన ఐరిష్ కథలన్నీ తమాషాగా అల్లి చెప్పి, ఆనందింపజేశాడు.

ఆ పెళ్ళి దుస్తుల్లో క్రిస్టినీ మా అందరి కళ్ళకీ ఎంతో ఆనందంగా కనిపించింది. పెళ్ళి అయిపోగానే, తన భర్తతో కలిసి క్రిస్టినీ ఉత్తరంగా ఉన్న పట్నానికి వెళ్ళిపోయింది. ఆమె భర్త అక్కడ కొత్తగా ప్రాక్టీస్ పెట్టడానికి నిర్ణయించుకున్నాడు.

క్రిస్టినీ పెళ్ళయి పోయిన తర్వాత, తన కొత్త జీవితం గురించీ, అక్కడి పరిస్థితుల గురించీ క్రమం తప్పకుండా మాకు ఉత్తరాలు రాస్తూ ఉండేది. ఓ సంవత్సరం గడిచింది. హఠాత్తుగా ఓ రోజున క్రిస్టినీ, ఆమె భర్త ఫ్రాంక్ మా ఊరొచ్చారు.

క్రిస్టినీ గర్భం దాల్చింది; మనుమడు తనింట్లోనే పుట్టాలంది అమ్మ.

క్రిస్టినీని ఆస్పిటల్‌కి తీసుకెళ్ళారు. ఆ రోజున నేను స్కూల్లో పాఠం చెబుతున్నాను. అంతలో నాకెవరో ఫోన్ చేశారు. నా క్లాస్‌ని మరో టీచర్‌కి అప్పగించి, చర చర బయటకు వెళ్ళాను.

అమ్మ నా కోసం హాల్లో ఎదురు చూస్తోంది.

"వాళ్ళు నన్ను క్రిస్టినీని చూడనివ్వడం లేదు," అంది అమ్మ.

ఆమె కళ్ళల్లో దైన్యం కనిపిస్తోంది. ఇది వరకు డాగ్‌మర్ ఆస్పిటల్‌లో ఉన్నప్పుడు అమ్మ ఇలాగే బాధపడింది. అప్పుడు నాన్న కూడా అనారోగ్యంగా ఉన్నాడు. ఇంట్లో ఎవరికైనా అస్వస్థతగా ఉంటే, అమ్మ భరించలేని వేదన అనుభవిస్తుంది.

ఆస్పిటల్‌లో క్రిస్టినీ ఉన్న గది ఇవతల మేం వేచి ఉన్నాం. నెల్సన్, ఫ్రాంక్, ఇవతలి కొచ్చారు.

"అమ్మాయికి ఎలా ఉంది నాయనా!" ఆత్రుతగా అడిగింది అమ్మ.

నెల్సన్ మౌనంగా తల ఆడించాడు. ఫ్రాంక్ అమ్మ రెండు చేతులూ పట్టుకుని, ఏమీ మాట్లాడలేక పోయాడు.

"ఏమయింది?"

"క్రిస్టినీ బ్రతకడం కష్టమమ్మా," అన్నాడు అమ్మతో, నెల్సన్ విచారంతో క్రుంగిపోతూ.

"ఆఁ!" అమ్మ వణికిపోయింది.

ఫ్రాంక్ అమ్మ కెదురుగా తల వంచుకు నిలబడ్డాడు.

"నేను లోపలి కెళ్ళి, దాన్ని చూస్తాను, అంది అమ్మ.

"నువ్వు లోపలికి వెళ్ళడం మంచిది కాదమ్మా," అన్నాడు నెల్సన్.

"ఫరవాలేదు."

"వెళ్ళొద్దు."

"నేను దాని తల్లిని కాదుట్రా?"

"కావచ్చు. నేను దాని అన్నను. ఫ్రాంక్ దాని భర్త. మేం డాక్టర్లమే కదా? క్రిస్టీనీని బ్రతికించుకోడానికి మా సర్వశక్తులూ వినియోగిస్తాం."

"కాని, మీరెప్పుడైనా పిల్లల్ని కన్నారా?" అంటూ, అమ్మ చరచర లోపలికి వెళ్ళింది.

క్రిస్టిని ముఖం తలగడమీద తెల్లగా మంచుగడ్డలా ఉంది.

'అమ్మా!'

'ఎలా ఉన్నావ్, తల్లీ?" అంది అమ్మ.

"అమ్మా, తర్వాత ఈ బిడ్డని తీసుకెడతావా?" క్రిస్టినీ మాటకి ఆమె గొంతులో ఏదో అడ్డుకుంది.

"మీరంతా క్షేమంగా ఉంటే, అంతే చాలు," అంది క్రిస్టినీ కొంచెం సేపయ్యాక.

అమ్మ కిటికీ దగ్గర కెళ్ళి, తలుపు తెరిచింది.

"ఏమిటమ్మా, పిల్లవాణ్ణి తీసుకో మంటావా?" అంది అమ్మ.

క్రిస్టినీ బుగ్గలమీద కన్నీటిధారలు ప్రవహించాయి.

"వాళ్ళు చెప్పలేదా? నేను బ్రతకనని నీకు తెలీదా అమ్మా?" అంది హీన స్వరంలో క్రిస్టినీ.

క్రిస్టినీ ముఖం తలగడలో దాచుకుని, "మీకు తెలియదు. నేనింక బ్రతకను," అంది.

అమ్మ కృంగిపోయిన హృదయంతో "నాకు ఐదుగురు పిల్లలు. నేనూ ఎంతో కాలం బ్రతకను," అంటూ క్రిస్టినీ మంచం దగ్గర కెళ్ళి ఆమె కళ్ళల్లోకి చూసింది.

"అమ్మాయ్, నువ్వు నర్సు పని మానెయ్యడం మంచిది," అంది మళ్ళీ అమ్మ.

క్రిస్టినీ కళ్ళు మూసుకుని, నిట్టూర్చింది. ఒక నర్స్ ఆ గదిలోకి వచ్చి, మాతో క్రిస్టినీకి కొంచెం తేలికైన ఆహారం ఇయ్యవచ్చునని చెప్పింది. అమ్మ ఆమెతో తప్పకుండా పంపమని చెప్పింది. మరో ఐదు నిమిషాలకు టీ పట్టుకొచ్చి, అక్కడ పెట్టి వెళ్ళిపోయింది నర్స్.

నర్స్ వెళ్ళిన తర్వాత అమ్మ కెటిల్ లోంచి కప్పులోకి టీ పోసింది. ఆమె చేతులు వణికాయ్. నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయ్. గోడవారకు వెళ్ళాను. క్రిస్టినీ నా కన్నీళ్ళు గుర్తించలేకపోయింది.

"ఏదైనా తింటావా క్రిస్టీనీ? ఇక్కడ చికెన్, బంగాళాదుంపల కూర ఉన్నాయ్," అంది అమ్మ.

క్రిస్టినీ బాధగా మూలిగింది.

"నేను తినిపిస్తాను. పోనీ - కొంచెం టీ తాగుతావా?"

క్రిస్టినీ తల ఊపింది - కళ్ళు తెరవకుండా.

ఇలాంటి మంచి ఆహారం తినకుండా ఆరోగ్యం పాడు చేసుకోవడం మూర్ఖత్వం అమ్మాయ్," అంటూ అమ్మ తాను తినడం మొదలెట్టింది.

"ఏం చేస్తున్నావమ్మా?" అంది క్రిస్టినీ.

"నీకు తినడం చాతకాదు కనక, నీవు తెచ్చిన తిండి తింటున్నా," అంది అమ్మ.

క్రిస్టినీ మంచం మీాద లేచి కూచుంది,

నవ్వుతూ. అమ్మకి ధైర్యం కలిగింది—క్రిస్టినీ ముఖంలో నవ్వు చూశాక.

మళ్ళీ క్రిస్టినీ బాధగా నవ్వింది. అమ్మ దాని చేత టీ తాగించి, మంచం మీాదనించి లేవదీసి, పొదివి పట్టుకొని, బయటకు పురిటి గదిలోకి తీసుకెళ్ళింది. క్రిస్టినీ సురక్షితంగా ఏడు పౌన్ల బరువైన చక్కని మగపిల్లవాణ్ణి ప్రసవించింది.

నెల్సన్ బయటకు వచ్చి, క్రిస్టినీకి ఏమీా ప్రమాదం లేదనీ, ఖులాసాగా నవ్వుతోందనీ చెప్పగానే, అమ్మ శరీరంలో వణుకు తగ్గింది. అమ్మ ఆనందపడిపోయింది.

అమ్మ నా భుజాల మీాద చేతులు వేసి, ఆనుకుని నడిచింది. అమ్మని పురిటిగదిలోకి తీసుకెళ్ళాను.

పిల్లవాడి చిన్న ముచ్చటైన ముఖం చూడగానే, అమ్మ మురిసిపోతూ, తన్మయత్వంతో వాడ్ని ముద్దు పెట్టుకుంది.

"వీడికి మీ నాన్న ముక్కు ఎలా వచ్చిందో? నోరు అచ్చంగా క్రిస్టినీదే," అంది అమ్మ సంబరపడుతూ.

"ఏమిటమ్మా, ఏమంత అందంగా ఉన్నాడు? నా కళ్లకి ఉడికిన పీతలా ఉన్నాడు సుమా!" అన్నాను నేను.

"ఏమిటి కాట్రిన్, మీ అందరిలాగా వీడూ చాలా అందమైన పిల్లవాడే!" అంది అమ్మ, వాడేం మాట తీసిపోనట్టు.

నా ఆలోచనలన్నీ క్రిస్టినీమీదే ఉన్నాయి. క్రిస్టినీ ఇప్పుడు ఒక కొడుకుని కని, తల్లి అయింది. ఆమె గర్వంతో నా కళ్ళల్లోకి చూసింది.

పిల్లవాణ్ని అమ్మ తన్మయంతో తన హృదయానికి అదుముకుంది. —అమ్మలో ఇప్పుడు మాతృత్వం పూర్తిగా నా కళ్ళకి దర్శనమిచ్చింది. అమ్మ కళ్ళు మెరిశాయి.

